మలయు ప్రాతః కాల మలయ వాయువులచేఁ
జెమట బిందువుల మొత్తము లణంగఁ
గురియును స్మంచు తుంపురులు కెమ్మోవి నొ
క్కులకించుక భరిమ్ము గలుగఁ జేయ
నతిశీత పరవ శస్త్రి విమ్మయమంచు ని
ద్దుర నెత్తి కెక్కె తిత్తరముఁ జూప
గీ. నెవరు చూచెదరో" యంచు నించు కంత
భయము గల్గియు నా కేమి భయ మటంచు
దిటము మదిలోన నూని యచ్చటల నేత్ర
"టింగురంగా" యటంచు నింటికిని జనిమె"

౪ అ ౧౦౯ శ్రవ.

బాలామణికిఁ గలిగిన చెమట బిందువులు ప్రాతః కాల మలయ వాయువులచేఁ బోవుచున్న వఁట! చెమట పట్టుటను గుఱించి ౩౮వ యసందర్భమున వివరించి యున్నారము. మఱియు నిందు విశేష మేమన? ప్రాతః కాలమున మలయ మారుతము వీఁచు చున్న దఁట! మలయ మారుతము వసంతమున వీఁచును. కాని వర్ష ఋతువున వీవదు. వీరు వాన కారునఁ గూడఁ బిల్ల వాయువులు వీఁచుచున్న వనినారు. వాన కారున సీదర ( చలిగాలి ) వీఁచును. అది వీరు మలయ వాయువని భ్రమించినారు. మఱియు మూఁడవ పాదమున బాలామణి మోవిపై గల పలు నొక్కులకు మంచు తుంపరు లించుక భరమ్ము గొలుపు చున్న వఁట! వర్ష ఋతువున మంచు పడునని మే మెందును విని యుండలేదు. హేమంతమునఁ గుఱియును. అట్లని వీరే వ్రాయించినారు.

క. శ్రీవసంతము సతత హిమా
నీ మంతము వర్జిత లటీ నీ గాహన కే

శ్రీ మంగము ప్రబలించెన్

హేమంతము విరహి జనుల కేకూతంబై " ౫ ఆ ౨౫ శ్రవ.

బాలామణి యింటి కరుగు నప్పు డెల గోలు జల్లు పడుచుండి యుండు ను అది వీరు మంచుగా భావించినారు. ఆహా! భావనా బలము! ఇన్ని విధములగు నసందర్భములతో నిండి యుండిన పద్య మెందైన నుండునా! కాని యీ గ్రంథము నూత్నపుం గృతి యగుటచే వీరింగా నూర్కొని విష యములం జొప్పించిరి.

ఉ. గుమ. జననం బంది సమస్త పండితులు మెచ్చన్ దెచ్చుకొన్నట్టి కీ
ర్తిని నిష్కారణ మొక్క నాటికయి వార్ధిం గల్పంగా నేల! "
౫ ఆ ౨౯ శ్రవ.

ఈ మధుసూదనుఁడు పుట్టి సకల పండితులు మెచ్చఁగీర్తిని దెచ్చికొ న్నాఁడట! కొందరు పుట్టకుండఁ దెచ్చికొందురా! "జననం బందిన దాది" యనిన బాగుండును.

ఉత్సా. నిను విడనాడి నేటికి గణింపఁగ నొక్క నెలాయె నోయి! నిన్
గనుఁగొను నిచ్ఛఁగన్నులును గాయలు గాచెఁగదోయి! పేర్మి నా
మ్మనమున నెంచవోయి? మనుచూనము మానఁగదోయి? నాపయిన్
గనికరముంచవోయి? కడకంటనుజూడకు మోయి ప్రొక్కెదన్
౫ ఆ ౩౦ శ్రవ.

ఎంచవు + ఓయి, ఎంచవోయి. అని సంధి. ఇది వ్యతిరేకార్థకమగు టచే గౌరవము నెంచుట లేదని యర్థ మిచ్చుచున్నది. గ్రంథకర్తల య భిప్రాయము "ఎంచుమోయి" (ఎంచుము + ఓయి) అనిన నీడేరును. వీ రీ యసందర్భమును దెలిసికొన లేకపోయిరి. దీనితోఁ బాటింకొకటి గూ డ నున్నది. "నా పయిం గనికర ముంచ వోయి" యట! నా పయిం గనికర ముంపు మోయి (ఉంపుము + ఓయి) యనవలెను, శబ్దము భ్ర

ష్టమైనను నభిమతార్థ సిద్ధి యగుటకు వీరు "కనికర ముంచు మోయి" యని యైనఁ బ్రయోగింప లేక పోయిరి. "ఉంచవోయి" యనునది వ్యతిరేకార్థక మని వీరు గ్రహింప లేక పోయిరి.

౪౩. చ. క్రమముగ మానసంబు కనుగందె నినుం గను భాగ్యమబ్బమిం
దమకము హెచ్చ మిన్ను పయి దాఁటిన యట్టులఁ దోఁచె నీదు పై
దములకు వాచెఁ గన్నులు ముఖంబు యథాయథ లై నశించె శ
క్యమయిన స్వప్నమందయినఁ గన్పడుమా! గొంకమాలు నెచ్చెలీ!

౫. ఆ ౩౭ శ్రవ.

మిన్ను పయి దాఁటిన యట్టుల = ఆకాశము మీఁద నుండి లఘించి నట్టుల" అని యర్థము. ఆకాశము మీఁదఁ బడినట్లు తోఁచినదా? మీఁద దాఁటి నట్లు తోఁచినదా? ఆహా! ఏమి జాతీయోక్తులు?

౪౪. ఉ. రాపిడి గిబ్బిగుబ్బల నురమ్మున ద్రుమ్ముచుఁ గోర్కెఁ దెల్పుచుం
గోపము లేకయే కసరి కొట్టుచు "నొచ్చితి" వంచు వింతలం
జూపుచు ముద్దు పెట్టుచును సొంపుగ నన్నుఁ గమెత్తి చూచు నీ
చూపుల కీయఁగా వలదె? సోలెదు పద్యము లంబుజాననా!"

౫. ఆ ౪౯ శ్రవ.

సోలెదు ననసేమి? వివశత్వము నొందివ్రాలు నను నర్థమైనచోఁ బద్యములు వివశత్వము నొంది వ్రాలించును గాని వ్రాలవు. కావునఁ బ్రేరణేంచుకుఁ బ్రయోగింపవలెను. అట్లు గాక సోలెడనఁ బరిమాణార్థక మగుచో (సోల + ఎఁడు) నీ పరిమాణార్థకమగు నెఁడులో నరసున్న వేయుమి యొక దోష మట్లుంచి బాలామణి చూపులకు సోలెఁడు పద్దెము లీయవలదా? యని యడిగిన వీరికిఁ దవ్వెఁడు సాలువు బహుమతి సేయవలదా?

౪౫. సీ. భీతిల్ల నేమి యా భీత భీత మృగాక్షి

నట డించి యిచ్చోటి కరుగ నేల?"   ౫ఆ ౫౬ ప్ర.

అరుగు=పోవు నని యర్థము. కాని వచ్చు నను నాగమ నార్థకము గాదు. "ఇచ్చోటికి రానేల?" అని యుండవలెను గాని యిచ్చోటి కరుగ నేల యనఁ గూడదు. అనుటచే నసందర్భమై పోయినది. ఈ విద్వత్కవులు తమ యఖండ పాండిత్య గరిమచేఁ జను నరుగు ధాతువుల నాగమ నార్థకములుగఁ బ్రయోగించిరి.

"శ్లో. అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్య సన్నిధా"
యను నట్లు వీరి చెంత నసందర్భ భయము లేదు.

౮౬. ఉ. అక్కమలాక్షి యాతఁడును నగ్గలమై తనరారు పేర్మి పెం
పెక్కఁగఁ గొంత కాలము యభీష్ట సుఖమ్ములఁ దేలుచుండఁగా
నొక్కెడ నత్తలోదరియు నొక్క యయోగ్యతఁ జేసె గంబళీ
మెక్కుచు వెంద్రుకల్ వెదుక మేకొనుచోఁ గఱవౌనె వేరికిన్!
౫ఆ ౬౦ ప్ర.

కొంత కాల మను నీ శబ్దము "యభీష్ట సుఖమ్ములఁ దేలి" రని భూత క్రియ నుపయోగించి నపుడు ప్రయోగింపవలెను. వీ రట్లు గాక "యభీష్ట సుఖమ్ములఁ దేలుచుండఁగా" నని వర్తమాన క్రియ నుపయోగించి నప్పు డుపయోగించుటచే నసందర్భమైనది. దిద్దుకొందురు గాక.



## అన్వయాభాసములు.



చదువరులారా! సరస తిరుపతి వేంకట కవుల వ్రాఁత యందలి యసందర్భములను విమర్శించుటలో విసిగి పోయి దిక్ప్రదర్శనముగఁ గొన్ని మాత్ర మిం దుదాహరించితిమి. ఓపిక దాల్చి యింకను జూపుదమనిన మీరు సైతము విసిగి పోదు రను భయమ్మున నసందర్భ ప్రకరణము

సంతతితో ముగించితిమి. ఇఁక సర్వ వ్యాఖ్యానములఁ గొన్నిటి నుదాహరించెదము. విద్యా గోపిక మొయిఁ బరికింతురు గాత.

---

పా ణి గృ హీ త.

---

౧ ‹‹సీ. బిబ్బోకవతి యుబ్బు గుబ్బ దోయిని జూడ
మతిమాలి బతిమాలు యతియు రతికి
ఉడురాజ ముఖ కంటఁ బడి దాని జడఁ జూడ
జడదారి పెడదారిఁ జనఁగఁ దివురు
కన్నె మిన్న బెడంగు కన్ను సన్నలు గన్నఁ
గన్న వాఁడును దాల్మి నున్నఁ జేయుఁ
గల్కి ముద్దులు గుల్కు చిల్క పల్కుల కుల్కిఁ
బల్కరింపఁగఁ జూచుఁ గల్కియైన
గీ. నోంటి పాటునఁ జెలికడ నుంచెనేని
దత్తరమ్మున వేదాంతి తొత్తె వమను
చెలి శరీరమ్ము నొకపరి చే స్పృశింపఁ
బుంస్త్వ మొదవింపఁ జేయు నపుంసకునకు›› అ౧ ౭ అపాణి.

ఇందుఁ దాలిపాకముఁ జూడ నని ప్రయోగించినారు. ‹‹చూచినఁ›› అని చేదర్థకముఁ బ్రయోగించినఁ గాని యుందన్వయము సిద్ధింపదు. రెండు మూఁడు పాదములు నశ్లేష భ్రష్టము లైనవి. నాల్గవ పాదమునఁ ‹‹గల్కి ముద్దులు గుల్కు చిల్క పల్కుల కుల్కి›› అనుచో నరసున్న వేసి పరమైన దకారమునకు సరళాదేశము గావించిరి. అగుటచే నిదియుఁ జెడి పోయినది. ఇంకను జూడుఁడు. ఆ చెలి దేహ మొకసారి ముట్టినచో నపుంసకునకుఁ బుంస్త్వ మొదవింపఁ జేయునఁట! క్రమప్రకార మిచ్చట

నోదవు నని యుండ వలెను. ఇట్లు నే చెప్పి నదే ముకర్త యగు వేని నొ దవించు నవ లెను. పీ కీ రెండింటిని వదలి ప్రేరణము పై ప్రేరణము గావించినారు. అగుటచే నన్వయము చెడిన దని వేఱుగఁ జెప్ప వలెనా!

౨ ॥గీ. మునుపు విని నప్పుడే కొంత మొలక గనిన
వాని యనురాగ వృక్ష మివ్వాని కలన
నిపుడు తిరిగియు వింటచే నెదిగి వింత
సరణి నొక్కింత శాఖోప శాఖలలను॥ ౨౮ ౧౭౮ పాణి.

ఇవ్వాని కలనఁ = (శబ్దము చెడినను) వీని కారణము చేత నని యర్థము. మునుపు తిరిగియు వింటచే నని యుండుటచే నివ్వాని వలన నని వ లన వర్ణకమును బ్రయోగింప వలెను. అట్లు చేయకునికి నన్వయము చె డినది.

3 ॥ఉ. దండక ద్రోహముల్ సకల ధర్మములుఁ విడనాడి బోగపుఁ
ముండల తోడఁ బోవుటకు బుద్ధిని బ్రేరణ చేయుచున్న యా
రండల కొద్దు దానికి సరిసరిగా ధన మీయుచున్న బ్ర
హ్మాండము మున్గిపోయినటు లాపయి నేడ్తురు సర్వశూన్యులై॥
౨ ఆ ౯౫ పాణి.

ఇది కేవలము దండక పద్దమే. ఏమియు నన్వయము లేదు. ఉన్న చో గ్రంథకర్త లది యెట్లో సెలవిచ్చెదరు గాక.

౪ ॥గీ. మొదల సంసారమే కడు మోహమయము
గాన దానికె యొప్ప రఖండ మతులు
దానిలో లంజె వలని యుండైన సుఖము
చెప్పనా! శత్రువనకును నీ చేయు వలదు॥ ౨౮ ౯౮ పాణి.

లంజె వలని యనఁగా లంజె వలన నైన యని యర్థము. మరి ॥దిం డైన॥ అని యుండుటచే నిట లంజె వలన నని వలన వర్ణకమును బ్రయో

గింపవలెను. అట్లగు నెడల నన్వయము గుదురును. రచనా ప్రౌఢిమ లేక పోవుఁ గాక. ఇప్పుడు మొదలే చెడినది.

౫ గీ. తెచ్చిపెట్టిన సిగ్గయ్యె ధీర యగుట
సహజ వైఖరిఁ గనఁ జేసి చలదపాంగ
వీక్షణమ్ముల నొక్కింత వెల్లి గొలుప
నింపు మరు లెక్క యయ్యెదారుండు వలుకు" ౩ ఆ ౨౮ పా.

"జలజాక్షి ధీర యగుటచేఁ దెచ్చిపెట్టుకొనిన సిగ్గు గలదయ్యె సహజ వైఖరిఁ గనఁ జేసె" నని కర్త్రభిప్రాయము. కాని తెచ్చి పెట్టిన, అనఁ దెచ్చి పెట్టికొనిన, అనియు సిగ్గయ్యె నన సిగ్గు కలదయ్యె ననియు నర్థము సెప్పుటకు వీలుగాదు. అట్లు చెప్పినఁ గాని యన్వయము లేదు.

౬ గీ. నీవు చెప్పిన యట్లన యీ వెలంది
యేదియో కారణమ్మున నిక్కులమునఁ
బొడమె గాఁబోలు వయసునఁ బ్రోడ యయ్యె
నింత బిడియ మిక్కులమున నెందుఁ గలదె" ౩ ఆ ౨౬ పాణి.

"వయస్సుచేఁ బ్రోడ యయ్యె నింత బిడియ మీ కులమున నెందైనఁ గలదా!" అఁట! జలజాక్షియా ప్రోడ బిడియమా? ఇంత బిడియము గలది యని వ్రాసిన నన్వయము భ్రష్టము కాకుండును.

౭ క. మోమోట మించుకయు లే
కీ ముసలిది యిట్లు లనియెనే?" యనకుఁ డహో!
కాముకు లెక్కడ! సత్యము
లేమాడ్కి? నాకుఁ గ్రొత్తలే! యివి యెల్లన్" ౩ ఆ ౯౫ పా.

"కాముకు లెక్కడ! సత్యము లే మాడ్కి" అనుట నన్వయము సెడినది. "సత్యము లెక్కడ!" అనవలెను. అట్లనినఁ బ్రాసము విఱిగి పోవును. వ్రాస కొఱకన్వయముఁ బాడు సేసిరి. నక్క యెక్కడ? దేవలో

క మెక్కడ నను సామెత యైన వీరికి జ్ఞప్తికి రాని నీ యవస్థ తటస్థించినది.

౮. చ. కలసిన కొన్ని నాళ్ళకొకటిగాఁ గను ఎట్టెడి మేనుపై దినం
బులు చను మీఁద రెండు నయిపోవఁగఁ బోవ మగండు నాలుగై
వలపు క్రమమ్ముగా నుడుగు పట్టున సాని యవస్థ చూడఁగా
వలయుమతొక్కఁ డట్టియెడవచ్చునొయిచ్చునొ కామితార్థముల్
౩ ఆ ౯౯ పా.

ఈ పద్యమునకుఁ బ్రతి పదార్థమును జెప్పి యన్వయము గూడఁ జెప్పుటకు గ్రంథకర్తలను బ్రార్థించు చున్నారము.

౯. గీ. సానులను జేయు టుడిగి లోకాను గతిని
పెండిలి యొనర్చి కొనరాదె? వెల వెలందు
లంచుఁ గొందఱు బోధింతు రదియు నంత
మంచి త్రోవ యటంచు నా మదికి రాదు" ౩ ఆ ౧౦౭ పా.

సానులను జేయుట మాని వెల వెలందులు పెండ్లిండ్లు చేసి కొనరాదా? యఁట! సానులను జేయు వాండ్రెవ్వరు? వేశ్యమాతలు. కావున వేశ్యామాతలు తమ పిల్లలను సానులుగఁ జేయుట మాని తాము పెండ్లి చేసికో రాదా? యఁట! ఒనర్చు ధాతువున కాత్మనే పద క్రియ నను ప్రయుక్తము గావింప కున్న నీ యవస్థ రాకుండును. వీ రాత్మనే పదము నెటు బ్రయోగింప వలెనో యెఱుంగరు.

౧౦. ఉ. పంపిన సెట్టులో చెలినిఁ బాయఁగలే కెడఁబాసి "యుత్తరం
బంపుచు నుండుమీ" యనుచు నాదర ముట్టిపడంగఁ ? ల్కనై
లింపని సానముం దొరఁగ లేక యులందురు నష్ట పుణ్య కా
ర్యశ్యాంపు టవస్థ యెల్లఁ దనదై చనె నీ గతిఁ జింత నొందుచున్"
౪ ఆ ౩౧ పా.

ఉదాహరణము స్వప్నమునఁ గాంచిన లేక నేఁడు చూచిన నష్ట పుణ్యాల్ని కార్య్యం పు టనస యొనగునఁ గ ... గాయు టా! అన్వయ మేమైన గలదా? గ్రంథకర్తలు సెలవిచ్చెదరు గాక!

“మ. కలు ద్రావక జాగించుఁ జెప్పటకున గల్లిచ్చు నా చెల్ల మూ
కులు గూడఁగ గలుపమ్ము లంచుఁ ను వాక్కుల్ శాస్త్రముల్ గా జగం
బులకుం బోధ యొనర్చెనట్టి సు మహాత్ముల్ కష్టు కైలాస మూ
ఖులఁ బోలఁగఁ జాలరో? వశమొకో? ఖండింప నక్కట్టిలన్”

౫ ఆ ౮౬ పాణి.

కనుపు కైలాస మగు ఖలులంట! ఏమి యన్వయానుగుణ్యము! కడుపే కైలాస మని భావించు ఖలు లనుఁడు. మఱియు నిందుఁ “గల్లిచ్చు నా చెల్ల మూకు” లని ప్రయోగించినారు. “కల్లిచ్చు” నను నీ విశేషణము చెల్ల కన్వయించు నని వీరి యభిప్రాయము. చెల్లమూకు ల నునది షష్ఠీ తత్పురుష మగుటచే నా విశేషణ మాకుల కన్వయించుచు. అట్లైన యగు నెడల నాకులు కల్లిడువా యుందురా? అనుఁడు. మహా కవులు!

౧౨౨. ఉ. వీఁడగు వీఁడు గాకునికి నేస్తాఁడో” నను స్త్రీ సద్ధిఁ దూఁ
గాడెడి యంకకత్తెఁగొని యుత్తమగోవకి పంజరమ్ముగా
క్రీడకుఁ గాకి నుంచుగతి గేహాము నందిడ గేహినీ గతుల్
పాడుకొలమ్ము కొమ్ములకుఁ బట్టున? పై పయి నవ్వియున్న వే!”

౫ ఆ ౯౨ పాణి.

“కాకునికి” అనఁగాఁ గాక పోవుటచే నని యర్థము. కాకున్న నని చేసర్థకము రాదు. అట్లగుటచే నన్వయము సెడినది.

౧౩౩. ఉ. మాడువులెన్ని? పూవుల సునాళము లందగు తోటలెన్ని! పై
నీడు వచింప రాఁదగని వెన్ని సిరుల్! తన కేమివచ్చె న

హ్వము విడక? విడక సరియె వెన్కటియాత్మపురమ్ముఁ జేరుటన్
బూడిదె యేటి కిప్పరిని బ్రోవలె వర్తన మద్ది కొంపలన్.

౫ ఆ ౧౦౯ పా.

ఇందలి ‘‘బూడిద’’ ప్రయోజనమును జెప్పుచు గ్రంథకర్త లన్వయమును సెలవిత్తురు గాక.

౧౮. ఉ. ఏ నొనరించు చేష్ట యది యీ చినవాఁ డొకరుండె కాక యీ
వానర సేన కెల్లయుఁగ వచ్చు? నెటుంగక యేమి పిల్లి దా
గా నని కన్నులన్ భయముఁ గంపము నొందుచుఁ గాలుద్రావనే
ర్గానరొకింపఁదీయుటకుఁగాఁ బ్రయతించితి నేమొ మెయి? యీసునన్

౬ ఆ ౮౯ పా.

‘‘నేను చేయు పని యీ చిన్నవాఁ డొక్కఁడే కాక యీ వానర సేన కెల్లయుఁగ వచ్చు’’ నట! చిన్నవాఁడు, ప్రథమ. వానరసేనకు, షష్ఠి. ఎల్లయుఁగవచ్చు ననునది షష్ఠీ విభక్తితో నన్వయించును. గాని ప్రథమతోఁ గాదు. కావునఁ జిన్నవాఁ డనుచోఁ జిన్నవాని కని ప్రయోగింపవలెను. ఆ శబ్దము ప్రథమగనే యుండవలయు ననుచో ‘‘వానరసేన’’ యనియు ‘‘నెటుంగు’’ నని దిద్దికొనవలెను. ముందుఁ గల ‘‘యెటుంగకేమి’’ యనునది ప్రథమతో నన్వయించునది గావున నట్లు దిద్దుకొనుటయే మంచిది.

౧౯. చ. ఎటువారకన్ ధ నాంగనకు నిట్టి కొలమ్ము వయస్సు రూపము
కృటికము పెర్మికూర్మిగల కాముకుఁ, డెట్టిక బోతిక వానితోఁ
గుటిలుఁడు వాని కైతె యది గొంతుక కోసె, దరిద్రుఁ జెట్టి కి
చ్చుటి కరుదెంచెఁ గూళవిధి చెడ్డము లెవ్వరి నట్లు సేయుచో

౭ ఆ ౫౦ పా.

ఇంకనేమి "కూళవిధి చెడ్డయము సన్వరి నెట్లు సేయవే?" యన నేమో విశదముగ వ్రాయించెదరు గాత.

---

## శ్ర వ ణా నం ద ము.

౧ "క. ఉదూటికి నొక్కొక రవ
తారం బెత్తిరట శతవధానము చేసఁగ
గారపులిఁ జూచి నక్కయు
నోరూఢిగ వాఁత పెట్టిన నట్లగు నేమో" ౧ ఆ ౩౦ శ్రవ.

"పులిని జూచి నక్క వాఁతలు పెట్టుకొనిన" ట్లని లోకోక్తి. కాని వీ రెవరికో నక్క వాఁతలు పెట్టిన యెడల ననినారు. అంతటితోఁ గుదిర్చినారా? వాఁతలు పెట్టిన యెడల నట్లగు నేమో యనినారు. అట్లన నెట్లో? అన్నివిధములఁ దీ పద్యము సముద్ర గామి యైనది.

౧౨ "వ. వినోదంబుగాఁ గతిపయ మిత్ర సహితుండనై కూర్చుండి యస్మద్విరచితమ్ములగు ధాతు రత్నాకర కాళీసహస్ర శృంగార శృంగాటక కుశలంభా సంపాదాది కంబులగు సంస్కృత గ్రంథంబుల నచ్చు టచ్చుటకి శ్లోకమ్ములును" ౧ ఈ ౨౩ శ్రవ.

ఈ "గ్రంథంబుల నచ్చు టచ్చుటకి" యన గ్రంథంబులయం దచ్చు టచ్చుటకి యని యర్థము. గ్రంథంబుల యందలి యను నర్థము రాదు. అట్లు వచ్చినఁ గాని యన్వయము లేదు. అదియుఁ గాక, ధాతురత్నాకరమఁట! కాళీసహస్రనామమఁట! శృంగార శృంగాటక మఁట! ఎక్కడ నున్నవో. కాళీసహస్రము మాత్రము కొలఁది శ్లోకములతో వెలువడినది. ధాతురత్నాకరము శృంగార శృంగాటకము లేవు. వీరు పుట్టని బిడ్డకుఁ బేరు పెట్టిరి. ఆలు లేదు, చూలు లేదు. కొడుకు పేరు సోమలింగ మఁట!

౩॥ఉ. మేధ మెయిన్ బృహస్పతి నవీకృతుఁడా చెలువయ్య మంత్రి గం
గాధర రామరాయ నృపకాంతుఁడు గావు కులాగ్ర గణ్యుఁ డా
రాధిత సత్యవీంద్రుఁ డతి రమ్యుఁడునై తగు పీఠికాపురీ
నాథుని మంత్రియై యశమునన్ దెరగక్కె దిగంత మంతటన్ ॥

(౧ ఆ ౪౫ శ్రవ.

“దిగంత మంతటన్” అన సర్గమేమో విస్పష్టముగఁ జెప్పి పద్యము సమన్వయింతురు గాక.

౪॥చ. వితత యశోంబు ధార్మికుఁడు వేలకు వేలు గణించు వాఁడు పం
డితుఁడు సమస్తరాజ మకుటీ మణి రంజిత పాదుఁడార్య స
న్నుతుఁడగు నాథరాసురుఁడనుంగుఁ బ్రియుండగుగాత” యంచు స
న్నుతిగొని చరింతు నెంతయునినుర్ సమకూర్పఁగ దేరయమ్మునన్ ॥

౧ ఆ ౭౫ శ్రవ.

ఇందలి యొకటి రెండు పాదములు మధుసూదనుని విశేషణములతో నిండి యున్నవి. బాలామణి “యట్టి విశేషణ విశిష్టుఁడైన బ్రాహ్మణుఁడు (మధుసూదనుఁడు) అనుంగుఁ బ్రియుండగుఁగాత. అని నిన్ను సన్నుతించెదను. త్వరగ సమకూర్పుము” అనినది. అగుఁగాత మను నీ యాశీర్వచన మెవరికి? తనకుఁ బ్రియుఁడు కావలెనని బాలామణి యభిప్రాయము. కాని యీ పద్యమున నా యభిప్రాయము రాకపోవుట యటుండ నన్వయమే చెడిపోయినది, దిద్దుకొందురు గాక. సమర్థింపఁ జూనెక రోనిఁ బ్రతి పదార్థము జెప్పి సమన్వయింతురు గాక. (గాము సమర్థింపఁ జూనిన ప్రతి పద్యము నకును బ్రతిపదార్థమును జెప్పెదరు గాక)

గీ॥ అనుచుఁ దన తల్లి తోఁదఁ జెప్పినది కాని
తాను తా నయి స్వాతంత్ర్య మానవత్యో
నెంత వలపున్న నెంత వలంతి యైన

జననిఁ గిఁకురింప లేదు వేశ్యా వధూటి ”  ౧ ఆ ౯౬ శ్రవ.

“ తాను తా నయి ” యను పదము నిరర్థకము. “ తనకుఁ దాన యి ” యనియున్నఁ గాని యన్వయము లేదు.

౬౹శా. ఏనేకాదు మదీయమైన కులముం జెన్నొందరాలాయెఁ గా
  సీ నీచుల్ వినఁ బోరు చూడరు ధనంబీసీ ధనం బీయకే
  పోనీ బ్రాహ్మణ జాతిఁదక్క నితరుల్ భోగింపఁగాఁ బోరు తా
  దేనిన్ క్షత్రియజాతి యన్యము మురారేమాకుఁ జర్చింపఁగాన్ ”
   ౨ ఆ ౨౪ శ్రవ.

తొలుత “ బ్రాహ్మణజాతి ” నని సంఘపరముగఁ జెప్పి పిదప నితరు నని కేవల మొక వ్యక్తి పరముగఁ జెప్పఁ గూడదు. బ్రాహ్మణజాతి యన బ్రాహ్మణజాతి గలవాఁడని యర్థముఁ జెప్పి కొందమన్నను ముందున్న “ క్షత్రియజాతి ” యను పదమునకుఁ గూడ క్షత్రియ జాతి కలవాఁడని యర్థము చెప్పుకొంద మన్నను దానికి ముందుఁగల “ యన్య ” మను పదమట్లు చెప్పుకొనుట కవకాశ మొసంగుట లేదు. కావున నన్వయము చెడిపోయినది.

౭౹ఉ. రాగము లేకయే పయికి రాగము గల్గిన రీతిఁ జూపుచున్
  రోగము గల్గియున్ బయికి రోగము లేదని బొంకులాడుచున్
  సాగిన యంతవట్టుఁ గడుఁ జల్లఁగ ద్రవ్యము లాగులాడు నీ
  భోగముజాతి నమ్ముటలు పోలవుగా భువి నెంత వారికిన్ ”
   ౨ ఆ ౧౫౮ శ్రవ.

లాగులాడు = పెనఁగులాడు, అని యర్థము. ఇచ్చట నీ రెట్లన్వయము చెప్పెదరో చూడవలసి యున్నది. లాగులాడు. అనఁగా గ్రహించు, అని గ్రంథకర్తల యభిప్రాయము కాఁబోలు! అది యిందు లేదు; ఈ పద మిట నపారమును గూడఁ గలిగించినది. లాగులాడు అను పదమునకు

గ్రహించు, అను నర్థ మున్నదని మీరు పెనఁగులాడక దిద్దుకొనరు రని మా యభిప్రాయము.

౮ ॥గీ. మనకు మేళములకు వచ్చు ధనముకన్నఁ
దగిన వారలతోడ సందర్భములు ఘ
టించుటే ముఖ్యమగు లాభ మెంచిచూడు
మేమెఱుంగుదు మీ లాభ మింకువదన? ” ౨ అ ౧౦౮ ప్రశ.

“ మనకు మేళములకు వచ్చు ధనము కంటెఁ దగిన వారలతో సందర్భములు ఘటించుటే ముఖ్యలాభ ” మఁట! ఏమి యన్వయాను గుణ్యముగ నున్నది! దిద్దుకొనుఁడని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. దిద్దుకొనుటే ముఖ్యమగు లాభమని వారే యెఱుంగుదురు.

౯ ॥క. ఈ విధమున నతఁడెంతయు
నావేదనఁ గెందుచుండె న వ్వనితయుఁ దా
నే విధిఁ దోఁచక గృహమున
కై వగ మీఱంగ, జేరి దూత్స గతమునన్ ”

3 అ ౮౧ ప్రశ.

బాలామణి యేమియుఁ దోఁచక గృహము కొఱకుఁ జేరెన దఁట! గృహము కొఱ కెక్కడఁ జేరినదో? గృహమును జేరినగని గ్రంథకర్తల యభిప్రాయము. ద్వితీయకుఁ జతుర్థిఁ బ్రయోగించినారు. పంచమీ విభక్తి ప్రత్యయమును బ్రయోగింప నందులకు మన మానందింప వలసియున్నది.

౧౦॥మ. తనుఁదానచ్చిన వేశ్యఁగూడు సుఖమింతా? యెంతయో తెల్పనా
కవు వౌనా? యనియట్టులుంచు మిది బ్రహ్మాదుల్ గణింపంగ శ
క్తిని బొందంగలరా! యటంచ నెను నీ తీపింతగాఁబోలు న్నో
ఘనమా! వద్దికనాడుమాటవిను మూ! మర్యాదగాపాడుమా”

౫ అ ౧౮ ప్రశ.

"తనకుఁ దాను" అను మాటను వీ రిట్లు పాడుచేసిరి. ఈ శబ్దము నే "తాను తా నయి" యని వీరు వ్రాసిన యపభ్రంశపు వ్రాఁతను వేఱొకచో నుదాహరించితిమి. వీరు తమ కలమును జిత్తమువచ్చినట్లు పో నిచ్చెదరే గాని మంచి చెడ్డలను జూడరు.



## వ్యాకరణ భ్రంశములు.



రామకృష్ణ ప్రయుక్తమగు శతఘ్ని సరస తిరుపతి వేంకట కవుల వ్యాకరణ వైదుష్యమను దుర్గప్రాకారమును ఖండ ఖండములుగ భేదించి వైచుట యెల్ల రెఱింగిన విషయమే. కావున మే మిట మఱల నా విషయమును విమర్శింప వలసిన యవసర మంతగా లేదుగాని మానుట యంత యుక్తముగాఁ దోఁచుట లేదు. ఏమన? కొందఱ కవిత్వము క్రమ క్రమముగ నిర్దుష్టమై యుండును. వీరి కవిత్వ మట్లుగాక మొదటి నుండి తుద వఱకు నొక్క విధముగనే యున్నది. అంతియ గాక పరీక్షించి చూచు వారికి శ్రవణానందము రచించిన నాఁటి శైలి కంటె నిప్పటి శైలి వికార దూషితమై యున్నట్లవగతము కాకపోదు. అయినను వీరు

"చ. పరిణత శక్తులైన యల భారతపుంగవు లట్టులుండ ము
ష్కరు డనిపించు కొన్న కవి సామజ సింహము రామకృష్ణు వా
గ్విరచన గూడఁ జూడుఁడు ప్రవేశ ఫలమ్ములు చిన్న చిన్న వ్యా
కరణపుఁబొత్తముల్ గొణిగికయ్యముఁబెంచకుఁడయ్య వాగ్విదుల్"

౧ ౮ ౧౬ పా.

అని తామే వ్యాకరణమున నసామాన్య వైదుషీవిలసితులమని ప్రగల్భములు కొట్టుచుండుట వలనను, నట్లు ప్రగల్భములు గొట్టిన పద్యమైనను దప్పులు లేకుండ వ్రాయఁ జాలక పోవుట వలనను మే మీ వ్యాకరణ భ్రం

శముల నుదాహరించుట యనవసరము గాదు. అయినను గొన్ని దోషములను మాత్ర ముదాహరింపఁ దలంచితిమి. పూర్తిగఁ జూపఁ దొరకొన్న నీ యొక్క విషయమును గూర్చిన మా విమర్శ గ్రంథము మూల గ్రంథములను మించును. వీరి తొట్రుకులను దిఙ్మాత్రముగ లోకమునకుఁ దెలుప వలయునని మాత్రమే మా తలంపు అంతకన్న వేఱుగాదు. అసందర్భ ప్రకరణము నందును నన్వయాభాస ప్రకరణము నందును వలెఁ బద్యము నంతను వ్రాయక యా పద్యముల యందలి దుష్టపదములను మాత్ర మిం దుదాహరించెదము.

---

## పాణిగృహీత.

---

౧. "మన్నించుఁడూ ... పెంచకుఁ .. ఆగ్రహించకుఁడు" (౧ ఆ ౧౫ పాణి.) మన్నించుఁడు తప్పు. మన్నింపుఁడు. అని యుండ వలెను. పెంపకుఁడు ఆగ్రహింపకుఁడు అనియు నుండ వలెను.

౨. "కయ్యముఁ బెంచకుఁడు" (౧ ఆ ౧౬ పాణి) పెంపకుఁడని యుండవలెను (ఇఁక నీ తరగతి దోషములు చూపఁబడవు) వీరు కయ్యమునకుఁ గాలు దువ్విన పద్యము లైనను నిర్దోషముగఁ జెప్ప లేకపోయిరి!

౩. "తీతురేమో" (౨ ఆ ౨౦ పాణి) తీయుదురేమో యని సాధురూపము.

౪. "గయా శ్రాద్ధమ్ములం జేతురో" (౧ఆ౨౪ పాణి) చేయుదురో.

౫. "ఋణము దీర్చ న్నేర్చనే" (౨ఆ౩౫ పాణి) తీర్ప న్నేర్చనే.

౬. "కొండలెఁ గన్నులే" (౨ఆ౩౭ పాణి) కొండలఁ గన్నులే.

౭. "పని గల్పించుక" (౨ఆ ౭౯ పాణి) కల్పించుకొని. ఆత్మనే

పదముగు కాను ధాతువునకు "క" ప్రయోగింపరాదు.

౮. "పటుమతి సని నన్నూఱంగవలయును మీరల్" (౨అ౮౮పాణి) "పటుమతి యని" అని ప్రథమ ప్రయోజ్యము.

౯. "అధమపు వేశ్యలఁ గూడెదీ" (౨అ ౮౯పాణి) కర్మధారయంబు లందు ము వర్ణకంబునకుం బుంపు లగు నని చిన్నయసూరి. "అధమపు వేశ్య" లను సమాసమునఁ బుంపు లాదేశముగా వచ్చుటకు ము వర్ణక మెందున్నదో?

౧౦. "నామేడ నుంచ, నేర్చితినయేని" (౩అ ౧౩పాణి) ఉంప నేర్చితిన యేని.

౧౧. "నీవు చెప్పిన యట్లన" (౩అ ౨౬పాణి) అట్లన తప్పు. ఇది ద్రుతాంతము గాదు.

౧౨. "ఎక్కడికి నేగిన నక్కడ గాఁపురమ్ములా!" (౪అ ౪౧పాణి) "అక్కడఁ గాఁపురమ్ములా" యని సరళాదేశము చేయవలెను. ఎక్కడికి? తప్పు. ఎక్కడకు.

౧౩. "పూర్వాలివి వీని కతమునఁ బూదిఁ గలియు" (౫అ ౪ పాణి) కతమునకుఁ దరువాత సరసున్న యెందులకు? బూది యనియే శబ్దస్వరూపము. పూది గాదు.

౧౪. "పదుపు తొత్తుల యానఁ బాఱరైరి" (౫అ ౧౫పాణి) పడపుఁ దొత్తుల అన వలెను మీరు పడపు శబ్దమును బదుపు అని పాడు చేసి యూపై వేయవలసిన ద్రుతమును వదలివేసినారు.

౧౫. "తెరుణికి సంతకుఁ మునుపెఁ గన్నయమ్మయ్యో" (౫అ ౭౩ పాణి) మునుపె తరువాత సరసున్న వేయు టెందులకో?

౧౬. "అమ్ముదిత వధింపు టొప్పగును" (౫అ ౬పాణి) భావార్థక ట ప్రత్యయము పరమగునపుడింపుగాగమురాదు. వధించుట అనవలెను.

౧౭. "పోక వదిగాఁ జుక్క వాడిచె" (౫ ఆ ౧౩౮ పాఠ) "అదిగాఁ జుక్క వాడిచె" అనవలెను.

౧౮. "ఏటికి దాఁచిపెట్టితిరి యేఁ గనకుండఁగ" (౬ ఆ ౧౦ పాఠ) సంధి చెడినది. "మధ్యమపురుష క్రియల యం దిత్తునకు సంధియగు" నని చిన్నయసూరి. దాఁచి పెట్టితిరి + ఏఁ గనకుండఁగ, దాఁచి పెట్టితి రేఁ గనకుండఁగ.

౧౯. "చాపఁ జిరుగఁ జదరయుఁగాదె!" (౬ ఆ ౨౩ పాఠ) చాపన్, అని ద్వితీయ ప్రయోగించు టెందులకు!

౨౦. "ముసుగు కాలువ" (౬ ఆ ౫౩ పాఠ) "మునుఁగుఁ గాలువ అనవలెను.

౨౧. "భవచ్చరణకంజములన్ గనిపెట్టుకుందు" (౬ ఆ ౧౦౫ పాఠ) "కనిపెట్టికొని యుందు" ననుట కీ పాట్లు వచ్చినవి.

---

## శ్ర వ ణా నం ద ము.

---

౧. "వేసనంతల గాలమ్ము" (౧ ఆ ౬౫ శ్రవ) ఇది గ్రామ్యోక్తి యని సమర్థింతురా? లేక మహాకవి ప్రయోగములను జీవగఱ్ఱ మున్నగు వానిలోఁ జేర్చి యానందింప వలసి యున్నదా?"

౧౨, ౧౩ వ పుటలు. కవితా విమర్శన ఖండనము.

౨. "నాకళ్ల యెదుట" (౧ ఆ ౭౨ శ్రవ.) "పూర్వ గ్రంథము నందే మొదటి యాశ్వాసము ౭౨వ పద్యమున "కళ్లు" అని ప్రయోగించిరి. కన్ను శబ్దమునకు బహువచన రూపము "కన్నులు" అనియుండును గాని "కళ్లు" అని యుండదని తెలిసిన పండితులు చెప్పిన పిమ్మ

టు సైతము పలుచోట్ల వేసియుండుటచే దిద్దుకొనలేక యది " లోకోక్తి కనుకరణ " మని వ్రాసిరి.

" సీ. నాకళ్లఁ యెదుట మొన్నటి దాఁకఁ జిన్నత
నంపుఁ జేష్టల నంచరింప లేదొ
... ... నున్నతి లేక వట్టి౹ వీధివీధుల విఱ్ఱవీఁగ లేదొ
... ... నంతయువింత రఘువంశమును జంకఁబెట్టుక చనఁగ లేదొ
... ... నున్నతు లెల్ల నవ్వంగఁ జిటిపొటి పద్యముల్ సెప్ప లేదొ
గీ. ఎంతలో నెంత వాఁడయ్యె నెంతబుద్ధి
వచ్చె నెటువంటి సత్కీర్తి వచ్చెఁ జిత్ర "
మనుచు నాతని చర్యలే యభినుతింత్రు
పండిత వరేణ్యు లక్కవి భాగ్యమేమొ "

" ఇక్కవి పరమేశ్వరోపాసకుఁడును విశిష్టాద్వైత మతస్థుఁడు నగు మధుసూదనాచార్యుఁడే. ఈ యభినుతించు వారును సామాన్యులు గారు పండిత వరేణ్యులు. వీరి వాక్యముల యందలిదే " కళ్లు " అను న పశబ్దము. దీనినే మన వృద్ధ కవులు లోకోక్తి కనుకరణ మని వ్రాసిరి. ఇది పద్యము నందలి పండిత వరేణ్యుల వాక్యముగాక వారనుకొనిన లౌకిల వాక్యమే యని యొప్పుకొందము. లక్కువ పదములు వ్యాకరణ సమ్మతముగాఁ బ్రయోగించిన యా లౌకిక లోక యీ శబ్దమునే పాడు సేయుదురా? కావున నిది తమ యనభిజ్ఞతను గోపనము సేయఁ దలఁచిన వృద్ధకవుల యుక్తియే యని నిష్కించి చెప్పుచున్నారము "

౧౨వ పుట కవితా విమర్శన ఖండనము.

3 " అనుంగుఁ బ్రియుండగుఁ గాత యంచు " ( ౧ ౮ ౯౫ శ్రేవ ) " గాతయంచు " తప్పు. " గాతసంచు " అనవలెను.

౪ " మేలు గణింపుడు " ( ౧౪ ౯౭ శ్రేవ ) శత్రర్థక చువర్ణకము

పరమగునపు డింపుగాగము రాదు. ''గణించుచు'' సాధు రూపము.

౫. ''మాయ మాటలకు నమ్మికమైన వ్యాఖ్యాత.. వంది'' (౨ ఆ ౫౫ శ్రవ) ''వేశ్యమాతను వర్ణించు నపుడు ''వ్యాఖ్యాత'' ''వంది'' అని పుంలింగ నిర్దేశముఁ జేసియున్నారు అనియత లింగము లగు నీ శబ్దముల కిట స్త్రీ లింగ ప్రయోగ మవశ్య కర్తవ్యము. పుంలింగ ప్రయోగము కేవల దూష్యము''

౧౮ వ పుట కవితా విమర్శన ఖండనము.

౬. ''కోర్కెలతలు'' (౨ ఆ ౯౧ శ్రవ) దుష్ట సమాసము.

౭. ''రతి పెంచుకొన్న గారంపు కీరంబు'' సాధి చేసినది. ''సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగు నపుడు నుగాగమంబగు'' నని చిన్నయసూరి ఇండే ''గీ. విటుల మోహింపఁ జేసెడి వేళలందు, మచ్చు మందుల బొమ్మనా మనల వలదె? సాని సాని యనంగనే సంబరంబె, వేరు రీతుల దాని సంసారి యనరె'' అను పద్యమున సంసారిణి యనుటకు ''సంసారి'' యని ప్రయోగించి తొండకు వెలుగు సాక్షి'' యను నట్లు దానికి మరియొక యప్రయోగముఁ జూపి దానను తృప్తిఁ జెందక యచ్ ప్రత్యయాంతముపై జీప్ వేయ వలయునని తమ యసాధారణ వ్యాకరణ పాండిత్యమును లోకమునకు వెల్లడించిరి శూద్రాదుల వలెఁ బుమాఖ్య గాని యచ్ ప్రత్యయాంతమగు సంసార శబ్దముపై జీప్ ప్రత్యయము వేయుదు మనుట వైయాకరణ ప్రతారణార్థము. శ్రీ కింకవీంద్ర ఘటా పంచాననులును పూర్వ శాకుంతలమును విమర్శించుచు ''స్త్రీలు బ్రహ్మవేత్తలని సంసారు లని రెండు తెరంగులై యుందురు'' అనుచోట ''ఈ స్త్రీలు స్త్రీలుకాక పురుషులై యుండ నొప్పురు. కాదేని వేత్తలును సంసారులును'' నెట్లగును? అనివ్రాసి సంసారీ శబ్దము దుష్ట మని యొప్పం

కొనిరి. కాని తాము నట్లే ప్రయోగించి యుండుట చేత నంసారి శబ్దమును మాత్ర మెట్లో మఱియొకరు సాధింతురు గాక యని యాశీర్వదించిరి ”
౧౧వపుట. కవితా విమర్శన ఖండనము.

౮. “మోహవారిధిని మున్గులఁగానొనరింపవచ్చు” (౨౮ ౧౧౨ శ్రవ) ఇటఁ బ్రథమ చేయవలెను.

౯. “ఏపాటీతఁడన ” ( ౨ ఆ ౧౦౩ శ్రవ ) నంధి చెడినది. ఏపాటియాతఁ డనవలెను.

౧౦. “ సిందూరంపు తోరంపు ” ( ౩ ఆ ౨౮ శ్రవ ) సిందూరంపుఁ దోరంపు అనవలెను.

౧౧. “ జనవాక్యం కర్తవ్యం ” జనిపెద్దలు ” ( ౩ ఆ ౪౩ శ్రవ ) నంధి చెడినది. అనుకరణంబునం దవామాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు ” నని చిన్నయసూరి. “ జనవాక్యం కర్తవ్య ” మ్మని, అనవలెను.

౧౨. “ కటాక్షు ముంచుమా యన నాలకించనైతి. కౌఁగిలించఁ బూనిన నమ్మతించనైతి. ఆరగించనైతి ” ( ౩ ఆ ౬౨ శ్రవ ) ఇట నిం చుక్కు లప్రయోజ్యములు. “ కటాక్షముంపుమా యన నాలకింపనైతి, కౌఁగిలింపఁ బూనిన నమ్మతింపనైతి, ఆరగింపనైతి ” అని యుండవలెను.

౧౩. “ కొంచమారీతి భాషించఁ దొడఁగె ” ( ౩ ఆ ౮౩ శ్రవ ) ఇదియు నట్టిదే. “ భాషింప ” అనవలెను.

౧౪. “ లిఖయింపుటకును బ్రారంభించె ” ( ౪ ఆ ౭ శ్రవ ) భావార్థక టప్రత్యయము పరమగునపు డించుగాగమే గాని యింపు గాగమము రాదు. “ లిఖయించుటకు ”

౧౫. “ ఖామలుఁ ధరించుక ” ( ౪ ఆ ౭౨ శ్రవ ) ‘ ధరించుకొని ’ అనవలెను.

౧౭. "పరిపంథినిబట్టి పలార్చ నేర్చునే" ( ౮ ఆ ౯౭ శ్రవ ) 'వలార్ప' అని సాధు రూపము.

౧౮. "పోవుటకునుగ్యాయించి యూర్పునిగుడించి" ( ౮ ఆ ౭౯ శ్రవ ) "నిగిడించి" అనవలెను.

౧౯. "ధనమాపోవును మానమాచెడును నిందా సత్తిపై కెక్కు" ( ౯ ఆ ౫ శ్రవ ) నిందా శబ్ద మాకారాంత స్త్రీ లింగము. సాంస్కృతికముల నిట్లు ప్రయోగింపరాదు. "నిందయూ" అని సాధురూపము.



## రసభంగములు.



పాఠక మహాశయులారా!

వీరు—

"గీ. తనకు నాల్గు నిఘంటు పదములు వచ్చు
ననుచుఁ బది మందికినిఁ దెలియంగ మాకు
మూల పదములు గుప్పిన ముచ్చటగునె?
ప్రతిపదమ్మున రసముట్టిపడినఁ గాక" (౧౪ ౧౫ శ్రవ)

అని తమకవిత్వమే సరసముగ నుండుననియు నితరుల కవిత్వ మట్టిది గాదనియు వ్రాసికొని యుండుటచే నితరుల కవిత్వ మెట్లున్నను వీరి కవిత్వ మెంత రసవంతముగ నున్నదో యని పరికింప మాకు ముచ్చట గలిగెను. అహంభావ ప్రపూరితమగు వీరి యీ పద్దెమే మా లేఖినికి రసభంగ ప్రకరణము వ్రాయఁ బనిఁ గల్పించినది. సరస తిరుపతి వేంకట కవుల కైత యందలి సారస్యమును మీరు పరికింతురు గాక.



## పాణిగృహీత.

---

౧ ,,మ. తమరీయూరికివచ్చు కార్యమది సాంతంబాయెనే?" (౨౮౬౧పా
ణి) ఇట సాంతంబనుటచే రసభంగ మైనది. "మీ కార్యము సాఫల్య
మాయెనా?" యని యడిగిన బాగుండును.

౨ ,,గీ. బాల్యమును మెట్టి మెడఁబట్టి బైటఁ గొట్టి
యౌవనము రా భయమ్మున నవఁగఁ జెలికి
చనులు చంకల దూరెను గనులు చెవుల
దూరె నడు మెట కేగెనో తోఁచదకట!" ౨౮ ౭౦ పాణి.

చనులు చంకల దూరెనఁట! ఆహా! ఏమి సారస్యము! ఇట్టి ప్రసంగము
నఁ జేమకూర వెంకన్న గావించిన వర్ణన మొక పరి దిలకింతము.

,,క. కడు హెచ్చుకొప్పు; దానిం
గడవం జను దోయి హెచ్చు, కటి యన్నిటికిం
గడు హెచ్చు; హెచ్చు లన్నియు
నడుమే పస లేదు గాని నారీమణికిన్"

౧ ఆ ౧౦౪. విజయ విలాసము.

ఇట్టి పద్యములను మన మెన్నిటి నుదహరించినను బ్రయోజనము లే
దు. ఈ రసమే కవి కవిత్వము నందు నుండఁ జాలదు. చేమకూర వెంక
న్న కేవలము చేమకూర వెంకన్నయే. వీరో; పరస తిరుపతి వేంకట కవు
లు గాదా?

౩ ,,సీ. కులుకుచు నొకసారి పలుకరించినఁ బిచ్చ
వానికైనను గచ్చ వదలిపోవు
బడనుగా నొకమాఱు భావమ్ము సూచింప
బ్రహ్మకైనను [illegible] కొవ్వులు" ౨౮ ౭౧ పాణి.

ఆహా! వర్ణనా వైదగ్ధ్యము! జలజాక్షి పలుకరించినచోఁ బిచ్చి వానికిఁ గూడఁ గచ్చ వదలి పోవునఁట! పిచ్చివాఁ డనుటలో నేమి విశేష మున్నదో? "ఉన్మాదునకుఁ" గూడ ననుటచే జలజాక్షికి నైచ్యము గలుగు చున్నది. అది వీరు కనిపెట్ట లేకపోయిరి. మఱియు "బమ్మకైనను రిమ్మతెవులు పుట్టునఁట! స్త్రీల విలాసములం గాంచిన నింద్రియ నిగ్రహవ్రతముగల వారికైనను మనసు చెడు ననుట సనాతనమునుండియు వాడుకలోనున్న కవి సాంప్రదాయము. కాని కూఁతును బెండ్లియాడి పార్వతిని మోహించి శృంగ భంగమును గాంచిన బమ్మకుఁ గూడనని చెప్పటలో నేమిరసమున్నది? "ఇనుప కచ్చడాల్ గట్టిన ముని ప్రముఖ్యు లెల్లఁ దామరస నేత్ర లిండ్ల బందాలు గారె?" యని పెద్దన్న. వీరీ సరసము నెఱుంగఁజాలక పోయిరి. వీరి ధోరణి పిచ్చి ధోరణి యని కొంద ఱందురు. అది నిజమే గాఁబోలు!

ఠ॥సీ. బిబ్బోకవతి యుబ్బుగుబ్బ దోయిని జూడ
మతిమాలిబతిమాలు యతియు రతికి
ఉడురాజముఖి కేంటఁ బడి దాని జడఁజూడ
జడదారి పెదదారిఁ జనఁగఁ దివురు" ౨౮ ౨ ఆశ్వా.

జలజాక్షి స్తనములంగన్న యతి రతికి బతిమాలునఁట! ఇదేమో విగుల సరసమైన శృంగార కల్పనమని వీరు తలంచి యుందురు. కాని శృంగారమునకు మూలము సంభోగమే యని తలంచు వీరి సరసత్వము గర్హ్యము. మఱియు జలజాక్షి జడఁగన్నచో జడదారి పెదదారి నన మునివృత్తికి వ్యతిరిక్త మార్గమును బట్టునఁట! "కలికి నెఱివేణి చందంబు కాల్వఁజానఁగ, నవలఁ బోలేక నిలిచె నయ్యగ్రజుండు" అను చేమకూర వెంకన్న రచన యందును వీరి రచన యందును గల సారస్యమును జదువరులే గ్రహింతురుగాక. ఇందు ముఖ్యముగ నింకొకటి విమర్శింపఁ దగినది గల

ము. జడదారి జలజాక్షిఁ గంటఁబడి దాని జడఁజూచినచోఁ బెడదారిఁ బట్టునఁట! దాని జడఁ గన్నచోఁ బెడదారిఁ బట్టినఁ బట్టవచ్చును గాని తొలుత జడదారి జలజాక్షిఁ గంటఁబడుటవలనఁ గలిగెడి వైలక్షణ్యమేమి? కేవలము జలజాక్షి కా యతియందుఁ బూజ్యభావముగాని, వానిం బుణ్యసత్వమువలనను కందమూల ఫల భక్షణము వలనను నవిరత యోగాభ్యాసము వలనను బ్రసక్తియుండు మించు శల్యావశిష్టమై కాషాయాంబర పరిధానితమగు నాతని బడుగు మేనుం గాంచుటచేఁ గనికరముగాని ముఖమునఁ బరిహాస సూచకమగు మందహాసముగాని సంభవించును. అంతకన్న వైలక్షణ్యమేమియుఁ గలుగదు. ఒకవేళఁ గలిగినను నప్రస్తుత ప్రశంసయు రసభంగమునగును. ఈ పాదమునింత భ్రష్టము సేయుటకన్న గుబ్బదోయికిని బొమ్మలకును విశేషణములు సేర్చినట్లీ జడకుఁగూడ విశేషణములు చేర్చిన రవ్వంత బాగుండును.

౫౧. "ఆ. వె. ఉండఁ గొంపలేక పండఁ బానుపు లేక
ముండకిచ్చుటకును ముదుపు లేక
మొండితనము పూని దండివారమటంచు
బండవిటులు తిరుగుచుండఁ గనమొ!"   ౨ ఆ ౯౩ పా.

"తినఁ దిండి, కట్ట బట్ట" యని లోకోక్తి. తినఁ దిండి, కట్ట బట్టయును లేనప్పటికి నుండఁ గొంపయుఁ బండఁ బానుపు లేవని చెప్పనక్కఱ లేదు. నాని ప్రసంగము రసభంజకము. "తినఁ దిండి, కట్ట బట్ట లేవను మాటకన్న మఱియొక మాట శుద్ధ దారిద్ర్యమును దెలుపుదు సేయఁ జాలదు. అంతియ కాని "ఉండఁ గొంప, పండఁ బానుపు" అనుటలో నేమియు రసము లేదు "ముండ కిచ్చుటకును ముదుపు లేక" యను వాక్యము బొత్తిగ రసమును బాడు చేసినది. ఈ రసమును మన తిరుపతి వేంకటకవులు తెలిసికొనఁ [illegible]

౬. క. ఒఱఁగిన చనుఁగవ గలిగిన
తెఱఁగెం గవ గూడుకన్నఁ దఱచై కడుఁ గ్రి
క్కొఱసిన చనుఁగవ గలిగిన
తెఱవల పద తాడనము శతగుణము మెఱుఁగౌ ”

౨ ఆ ౧౦౧ పాళి.

“ లంబకుచాలింగనతో లికుచకుచా పాదతాడనం శ్రేయ ” యని యొక గ్రామీణోక్తి గలదు. దాని నిట్లు వీ రాంధ్రీకరించిరి. కాని యొక విశేషము మాత్ర మున్నది. సంస్కృతమునఁ “ గౌఁగిలింతకన్న ” నని యున్నది. వీరు “ కవగూడుకన్న ” నని వా విడిచి చెప్పినారు. ఎంత సరసముగ నున్నను వీరి కాలింగనపద మానందమిడఁ జాలకపోయినది. వీరి యభిప్రాయ మా యాలింగన పదమున ధ్వనించుచునే యున్నది. వాచనములకు మఱఁగిన వీరు సూచనలచే నానందింతురా?

౭. ఉ. . . . . . ఏ నరునైన సంయ్యతివ నేలితొనం గమకింపదన్న మా
టే నిజము ” ౨ ఆ ౧౧౪ పాళి.

ఏలు ధాతువున కిటఁ “ గొను ” సను నాత్మనేపదము ననుబంధము సేయఁ గూడదు. “ ఏల ” ననినఁ జాలును. రస ముట్టిపడును.

౮. క. పలువురు ప్రియురాం డ్రొక్కెట
గల సభఁ బురుషుండు నిలువఁగలఁ డదిరసమున్
దొలఁగింపను కామిను లటు
నిలుచుటకున్ దగరు రసము నీరసము నగున్ ”

౩ ఆ ౯ పాళి.

పలువురు పురుషులున్న సభలో స్త్రీలు నిలువలేరా? నిలుచుటకుఁ దగరా? తగరనుటచే జలజాక్షి కుల విధ్వంసనకి యగుచున్నది. నిలువలే రనుటలో సారస్యమున్నది. ఇప్పుడు నీరసమైపోయినది.

౯ గీ. "సగము చచ్చి యంతయుఁ జచ్చి జగతి గాన
హాస్యములు నేర్చికొన వలె" నందురు"

3 ఆ ౨౧ పాణి.

"సగముచచ్చి సంగీతము, అంతయుఁజచ్చి హాస్యము" అని లోకోక్తి. సగముచచ్చి గాని సంగీతము, సంతయుఁజచ్చి గాని హాస్యమును సభలోఁ బ్రకాశము సేయ లేరని యీ లోకోక్తి భావము. అంతియకాని నేర్చికొన వలెననిగాదు. నేర్చికొనుటలో గష్టములేదు. రహస్యముగ నభ్యసింప వచ్చును. ఈ లోకోక్తింగల సారస్యమును గ్రహింపఁజాలక వీరిట్లు పాడుచేసిరి. "అహో! మూల ఘటిత పాండిత్య ప్రకర్ష" యను సామెతను సార్థకపఱచినారు. మహాకవులు!

౧౦ ఉ. ... నేఁటికయినా! కానఁగలాఁడి యూయతివ యాచెలి యా
చిగురాకుఁబోఁడి యా! కావరపుం జనుంగవ చోకాటపుటెక్కు వశమ్ము
గావలెఁ" 3 ఆ ౬౭ పాణి.

అతివ, చెలి, శబ్దములు నగఁగాఁడి, చిగురాకుఁబోఁడి, కావరపుం జనుంగవ చోకాటపుటెక్కు, శబ్దములవలె విశేషణ పర్యవసాయములు గామి పునరుక్తియుఁ బ్రక్రమ భంగమును, రస భంగమును గూడ నైనది.

౧౧ క. అంత నుదారుం డచ్చెలి
చెంత న్నిలుపోపలేక చేతోజాత
శ్రాంతికి వశుఁడై చనియెడి
చింతఁ లేచుటయు సతిని చెలికాఁడనియెన్ ॥

3 ఆ ౪౨ పాణి.

ఉదారుఁడు జలజాక్షిపై మరులుకొని యాచెలిచెంత నుండఁజాలక ప ధునమైనఁట! ఇది విపరీతము! లోకములో నెవఁడును దన మనస్సును హరించిన కాంతచెంత, నిలువఁబడలేకపోఁడు. ఎంతో యవసరము వచ్చినఁ గాని

ర్నమగుటచే నిట్లు భ్రష్టము చేసినారేమో యన నిది మొన్న మొన్ననే వేయి నూర్నాట పదార్ల కాశించి వ్రాసిన ప్రబంధము. శ్రవణానందమే మొదటిది. అందీ సందర్భమున బాగుగనే వ్రాసిరి. ఇందే పాడుచేసినారు. చిత్రము!

౧౨ ॥గీ. అనిమొఁబో! లంజెతనాటఁ దానట్టి మాట
నాదు యోగ్యత యెవ్వేడఁ బూడిఁ గలిసె ”

౪ ఆ ౧౧ పాణి.

“ అది లంజె యగుటచే నట్టిమాట యనిన ననుఁగాక. నా యోగ్యతయే బూడిదలోఁ గలిసినది. ” అఁట! ఈ రాయబారి వారకాంతా లంపటుఁ డగుటచే యోగ్యత మునుపే లేదు. ఈ “ యోగ్యత ” కు మారుఱు “ తెలివి తేట ” లనిన రస ముట్టిపడును. ఇట్టి సందర్భమునఁ దెలివి తేటలతోడనేగాని యోగ్యతతోఁ బని లేదు. కాని తెలివి తేటలు పయిం బడుఁ గలవా?

౧౩ ॥క. నా కారణమునఁ గులమున
కే కాని కళంకుగల్గె నిహిహీ! యిటుపై
నాకత విన్నను రోయక
యే కాముకు లిచ్చగింతు రిల వెల చెలులా ”

౪ ఆ ౨౨ పాణి.

ఇహిహీ యనునది నవ్వుటయం దగు ధ్వన్యనుకరము. కాని సంతాపార్థకముగాదు. రస భంగమని తలంపక పదార్థమును దెలియక పీ రీ శబ్దము నిటఁ బ్రయోగించిరి. అన్నా! నవ్వెంత పని చేసినది!

౧౪ ॥ఉ. పువ్వుల పిల్లు పోరఁగల పోదుము లెల్లను నొక్క రాత్రికే
యవ్విటుఁ డవ్వేలందియును నాసి సుఖించి ర విట్టి వట్టి వం
చెవ్వగఁ జెల్లనొప్పురు? న దేమిటి? కింతకెయుంగ నట్టి వా

లేవొక? పక్షులుఁ బశువులీ సుఖమందవా? యంతకెక్కుడే ''
౪ ఆ ౨౬ పాణి.

అదిరా! వర్ణనా వైదగ్ధ్యము! నాయికా నాయకులను బశువుల కన్న నధములుగఁ జేసి వైచిన సరస తిరుపతి వేంకట కవుల యఖండ వైదుషీ విలసనము సంస్తవనీయము. ఇది నీతిని గల్గించు విధము కాఁబోలు! నూత్నపుం గృతులలో నీతిని బోధించు పద్ధతి యిదియే కాఁబోలును! చదువరులకు విషయ సుఖములయందు వైముఖ్యము గలిగించుట కెంత పరిశ్రమముగఁ బ్రయత్నించుచున్నారు!

౧౪. ఉ. వచ్చిన దూతి చేతికిదె వచ్చితినంచు లిఖించి యిచ్చి పో
నిచ్చి మనమ్మునన్ బెరుగునిచ్చలు మోమునఁ దోఁపనంతలోఁ''
౪ ఆ ౬౦ పాణి

''పోనిచ్చి'' యఁట! ఆహా! ఎంత మృదువు! ఉపక్రమిత సప్రయోజ్యము. ''వ్రాసి యిచ్చి'' యనినఁ జాలును. ఈ రసభంగమును వీరు గుఱుతెఱుఁగరు.

౧౬. శా. . . . . ధనాశన్ గూఁతు వృద్ధాత్ముఁడో. వానిం జేర్చ నపాత్రుఁ గూడదనరు'' ౪ ఆ ౧౧౪ పాణి.

''వానిని జేర్చు'' ''వీనికిం గూర్చు'' ''వానికిఁదార్చు'' ననుపదములు వారకాంతల విషయమునఁ బ్రయోగింపఁ దగినవి వీరు సంసారిణుల యెడఁ బ్రయోగించిరి దీనికై మనము వింతపడ నక్కఱలేదు. లంజె శాస్త్రములో నట్టి మాటలుండును? వీరే వ్రాకుచ్చినారు.

''గీ. మాలపల్లె వర్ణించుచో మహీసురులను
జెప్పఁగతి దుర్వ్యాపలు వాడు తప్పు కూఁత
లెంత మృదువుగ మార్చినఁ గొంతయైన
బచ్చి యుండక మాన దప్పట్ల నిజము'' (౧ఆ ౨౭పాణి)

చెప్పినట్లు వర్ణించినారు. వీరి తప్పులేదు!

౧౭. చ. నరపతి గల్గు వాఁడు గడు సంపద బొల్చెడివాఁడు నూతన
స్మరుఁడన నొప్పువాఁడు మదమత్తుఁడునౌ విటుఁ డబ్బెయున్ ”
౫ ఆ ౪ ౨ పాణి.

మదమత్తుఁ డనుటచే రస భంగమైనది. ఈ పద ముపయోగించుటకుఁ దిరుపతి వేంకట కవులకుఁ గల భాష మసభ్యము.

౧౮. గీ. తెలుఁగు తెలుఁగని యద్దాని దిగుటె కాని
సంస్కృతమ్మునకన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమమున్నఁ జాలు
దాని, కిద్దానికో! రెంటఁ దగులవలయు ” ౫ ఆ ౫ ౩ పాణి.

దానికి (తెలుఁగునకు) రెంటను దగులవలయు నఁట! ఏ రీ తగులు శబ్ద మిటఁ దగుల్చుటచే రసభంగమైనది.

౧౯. గీ. ఉత్తరమ్మును వినిచిన యువతి దానఁ
గొంత శాంతించి నట్టుల కుటిలుఁ డతఁడు
తలఁచె ” ౬ ఆ ౩౧ పాణి.

ఉదారుఁడు కుటిలుఁ డగుట నుత్తరమును వినిపించుటచే జలజాక్షి శాంతించె నని తలఁచెనఁట! కుటిలుఁడా? మూర్ఖుఁడా? ఆహా! సరసత్వము!

౨౦. ఉ. ఎంతటిభాగ్యమే?యనుచు నెంతయదృష్టమొ?యంచు నెంతటిల్
వింతలె?యంచు నెంత పొరలేని తలంపులె? యంచు ముక్కుపై
నింతులు కేలు పెట్టికొని” ౬ ఆ ౫౨ పాణి.

ముక్కు మీఁదఁ జేయి పెట్టుకొందురా? వ్రేలు పెట్టుకొందురా? ముక్కు మీఁదఁ జేయి పెట్టుకొనిన రస మెట్టి దగును గాఁబోలు!

౨౧. గీ. వంట బ్రాహ్మణుతోఁ గాని బట్ట లుతుకు
వానితోఁ [illegible] తోడఁ

గాని లోకమ్ముతో పాటుగా నొకింత
కులికితినా యెందు కింత మీరా కులికిపాటు?" ౬ ఆ ౬౮ పాణి.

ఈ పద్దమంతయు నిట రసభంజకము! జలజాక్షి ప్రౌఢ ప్రౌఢ యిట్లు తేలిపోవునా? జలజాక్షి కేవలము ప్రౌఢ మాత్రమే గాదు వారకాంతయును. వీరి సంగతినైన జ్ఞప్తియం దుంచుకొనమి మా కాశ్చర్యమగుచున్నది.

---

## శ్రవణానందము.

౧. గీ. బాల్య వయసునుండి యాబాల చాలఁ
గవివరునితోడఁ గ్రీడింపఁగాఁ గలంచి
క్రమముగా సురతోపయోగమున కద్దు
దీరి పదునాలు గేండ్ల గొబ్బునారి యయ్యె" ౧ ఆ ౭౯ శ్రవ.

బాలామణి చిన్నతనమునుండియు మధుసూదనాచార్యునితోఁ గ్రీడింపఁ గలఁచి సురతోపయోగమున కద్దుదీరి పదునాలుగేండ్లదైనదఁట! "సురతోపయోగమున కద్దుదీరి" యనుటచే వీరేమో రసముట్టిపడుననుకొనిరి గాని యది విరసమై పయింబడి యసభ్యమైపోయినది. నూత్నపుంగృతులలోనుండు రసమిట్టిదే గాఁబోలు!

౨. సీ. పాడెనా! గంధర్వపాటలాధరల వీ
ణా నినాదంబు చిన్నతన మూను

* * * * * * * * * * * * * *

వేఁడెనా? వేదాంత విద్యావిశేషజ్ఞుఁ
డైనను మాఱు మాటాడ లేఁడు" ౧ ఆ ౪౦ పాణి.

బాలామణి పాడిన యెడల గంధర్వ స్త్రీలచేఁ జేయఁబడు వీణా ధ్వని

చిన్నతన మొందునఁట! బాలామణి కంఠధ్వని వీణా ధ్వని కంటె శ్రావ్యమని గ్రంథకర్తల యభిప్రాయము. కాని యీ వీణాధ్వని గంధర్వ స్త్రీలచేఁ జేయఁబడిన దనుటలో నేమి విశేషమున్నది? వీణా వినాదమనినఁ జాలును. వాదక విపత్తి యనవసరము ఈ విపత్తిచే బాలామణి పాటకు లాఘవమే గలిగినది. ఏమన? గంధర్వులు సంగీతము పాడువాండ్రు. నోటిపాటలవలననే గంధర్వులు పేరువడిరి గాని యంత్ర వాదనములచేఁగాదు. అగుటచే బాలామణి పాడిన గంధర్వాంగనలు చిన్నతనము నందుదురనినచో పీఠి యభిప్రాయ ప్రకారము రస ముట్టిపడును. ఇప్పుడో, " అర్జునుఁడు ధనుస్సు పట్టిన యెడల దుర్యోధనుని బాణము లమ్ముల పొదిలో డాఁగు " ననినట్లున్నది. అక్కడను రస భంగమైనదని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. మఱియు నిందు బాలామణి వేడినయెడల నెంత వేదాంత విద్యా విశేషజ్ఞుఁడైనను మాఱు మాటాడ ( అనఁగా సొత్తవడకుండ ) లేఁడట! " వేదాంత విద్యా విశేషజ్ఞుఁడనుటలో నేమి యాధిక్యమున్నది? వేదాంత విద్యా విశేషజ్ఞుఁడు కేవల శాస్త్రి పదవాచ్యుఁడు గావచ్చును. అంతియేగాని వేదాంతము జదువుకొనిన వారెల్లను విరాగులే యయ్యెదరను నియమము లేదు. వేదాంత శాస్త్రములో నద్వితీయులని పేరుగాంచి సతత తాపత్రయ నిమగ్నులగు వారి నిప్పుడెంచఁ జూడము? కావున నిచ్చట వేదాంత విద్యా విశేషజ్ఞుల నుదహరించిన లాభము లేదు. విషయసౌఖ్య విముఖు లనవలెను. వా రింద్రియ నిగ్రహ స్థిరవ్రతులు. అట్టి వారు గూడ బాలామణి యెడల ముగ్ధులు కాకుండ నుండఁజాలరనిన బాలామణి కతిశయము గలదు. ఇప్పుడా యతిశయము లాఘవముగఁ బరిణమించినది.

౩॥గీ. విత్తమార్జించు పనికైన వేలకోలఁది
గా నుపాయమ్ము [illegible] గాను శార

దా కుచమ్ములు గలవాఁడు దిక్కనితరుఁ
డింతికుచములు వట్టిన నేమి సుఖము? " ౧ ఆ ౯౧ శ్రవ.

శారదాకుచము లన సంగీతసాహిత్యములని వీరియభిప్రాయము. "సంగీతమపిసాహిత్యం సరస్వత్యాః కుచద్వయ " మ్మని యొక సంస్కృత కవి చెప్పిన శ్లోకము ననుసరించి వీరిట్లు వ్రాయించినారు. ఆకవి యట్లునూపించెనే గాని యది నిక్కమవునా? వీ రందలి చమత్కారమును గనిపెట్టలేక యిట్లు వ్రాయించినారు. *

౮. సీసగీతము. కరుణ గల్గిన నిల్లు బంగారమౌను
గరుణ దప్పిన నడవియౌ గడియలోన
బ్రహ్మకొడుకైనఁ గవులకు భయముఁ జెందు
మన మనఁగ నెంత? యక్కక్క! మదినిఁజూడ "
౧ ఆ ౧౦౩ శ్రవ.

ఇట "బ్రహ్మకొడుకైన" నవుటకన్న "దేవుఁడైన" ననిన రస ముట్టిపడును. బ్రహ్మకొడుకనుటలో నా రసము లేదు.

౯. సీసగీతము. వారితో మాటలాడ కీ వగుచు నీవు
సిగ్గు గైకొని తలవంచు టొప్పుగాదె?
వార లేమనుకొందు రీ వరుసఁ జూచి
యన్యులా? వారు మనకుఁ బద్మాయతాక్షి "
౨ ఆ ౧౪ శ్రవ.

* "సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః కుచద్వయ " మ్మను శ్లోక పాదార్థము ననుసరించి యస్మద్విరచితమగు వారకాంత యనునాటకమున నొకపద్యము వ్రాయఁబడినది. అదియుఁ దప్పేయని యిట వేఱుగ వ్రాయనక్కఱ లేదు. బాల్యమున రచింపఁబడుటచే నా గ్రంథమంతయు దోషభూయిష్టమై యున్నది. కొలఁది రోజులలో సవరించి ముద్రింపింపఁబడును.

« తల వంచుట » యనుటకుఁ « దలవంచుకొనుట » యనవలెను. అట్లనకపోవుటచే బాలామణి మధుసూదనుని తల వంచెనని గూడ యపార్థ మచ్చుచున్నది.

౬౹సీ. తన నవ్వుకన్నఁ జక్కని తెల్పుగల చాన్వ
కెందుఁవా భుజము చక్కటి నటింపఁ
దన మేనికన్న మెత్తని క్రొత్త మల్లెపూ
వులు వేణినుండి జలజలని రాలఁ
దన కాంతికన్న హెచ్చైన నొప్పు బంగారు
మొలనూలు కటిమీఁద మెఱసి చూడఁ
దన మోవికన్న నెఱ్ఱని రంగుగల గాగ
రా పదమ్ముల మీఁద రంగులీన» ౨ అ ౬౭ శ్రీవ.

బాలామణి యంతికోద్యానమున నొంటరిగనున్న మధుసూదనునిఁజూడఁ బోవుచున్నది. అప్పుడా పడఁతుఁగొమ్మ తన నవ్వుకంటెఁ దెల్లని కందువా భుజముపై వలెవాటు వేసికొనినదఁట! హాసమునకు ధావళ్యము కవి సమయసిద్ధము. ఆ ధావళ్య మద్వితీయము. హాసమునకన్నఁ గందువా తెల్లని దనుటచే హాస ధావళ్యమునకుఁ గళంకము గలుగుచున్నది. ఇట్లు వర్ణించుట సరసమా? « తన లేనగవు తేటకును బాటియౌ యన్నపోల్కి-దేటిచి హిమాంబువులు కొన్ని » ( ౨ అ ౧౩౩ విజయ విలాసము ) అని చేమకూర వెంకన్న. మఱియునిందే ( బాలామణి ) తన మేనికన్న మెత్తని మల్లెపూవులను వేణియం దలంకరించుకొనినదఁట! మల్లెపూవులకన్న మేనుమెత్తనిదా? మేనికన్న మల్లెపూవులు మెత్తనివా? కామిని కుసుమ కోమలియని ప్రసిద్ధి. మేనికన్న మెత్తని మల్లెపూవు లనుటచే శరీరమునకుఁ గాఠిన్యము గలుగుచున్నది. « మీనాంకుని చేతి బాణమన నందము చందము గల్గి » యొప్పు బాలామణి శరీరమున కట్టి కాఠిన్యమును

గలిగించుట న్యాయముగాదు. పూర్వానుభూతునికు లెవ్వరునిట్లు వర్ణించియుండలేదు.

"శ్లో. మహార్హశయ్యాపరివర్తనచ్యుతైః
స్వకేశపుష్పైరపి యాస్మ దూయతే।
అశేత సా బాహులతోపధాయినీ
నిషేదుషీ స్థండిల ఏవ కేవలే"

౫వ సర్గ ౧౨ శ్లో. కుమారసంభవము.

ఇంక నిట్టి యుదాహరణము లనేకములున్నవి. కాని గ్రంథవిస్తరభీతిచే మానినారము. మఱియు, బాలామణి తనశరీరకాంతికన్న నెక్కుడు కాంతిగల యొడ్డాణమును దాల్చినదఁట! శరీరకాంతికన్న స్వర్ణకాంతి హెచ్చనుటచే శారీరశోభకుఁ గళంకమొదవుచున్నది. "అంగముజాళువాపసిఁడి యంగము" (౧ ఆ ౧౦౫ విజ) మఱియు "ఈ వెలంది యొడల్ పైఁడిలో వెలంది" (౧ ఆ ౧౯౫ విజయ) అని చేమకూర వెంకన్న. "బొమ్మగాదిది బంగారు బొమ్మగాని" (౩ ఆ ౨౮ తారాశశాంక విజయము) అని శేషము వేంకటపతి. "కలికి రాయంచ కీసోయగంబు గలదె? యెమ్మెకలదిది జాళువా బొమ్మసేమొ" (౪ ఆ ౧౮౯ ఉత్తరరామాయణము) "తన కుంగినప్పు మేనితళుకులు తటధరాదుహాఘనావళిఁ గ్రమ్ముచుండుసింప" (౫ ఆ ౧౫౭ ఉత్తర.) అని కంకంటి పాపరాజు. "మున్ను బంగారుపెంపు హసించు దేహమే నైఖరినుండు మేల్వయసువలదు" (౨ ఆ ౧౦ నిరంకుశోపాఖ్యానము) అని కందుకూరి లింగయ్య. ఇట్టి యుదాహరణములు వందలకొలఁదిగ నీయవచ్చును. కాని వీరి ప్రాంత కాధారము గాన్పింపదు. మఱియు బాలామణి తన యధరమునకన్న నెఱ్ఱనగు గాక రాఁగట్టుకొన్నదఁట! ఇట్లు చెప్పుటచేఁ గథానాయిక మోవి రక్తిమకుఁ గళంక మేర్పడినది. చేమకూర వెంకన్న యి

ట్లు వ్రాసినాఁడు. „తెన యరుణాధరంబునకు సీడివి యన్న రమణ నేరిచి పల్లవములు కొన్ని" (౨ ఆ ౧౩౩ విజయవిలాసము) సుభద్ర ప్రవాళ ము తన యరుణాధరమును బోలునేమో యని తెచ్చినదఁట! ఎంత సర సముగ నున్నదో చూడుఁడు. విశ్వాత్కావుల వర్ణనా వైదగ్ధ్యమిట్లుండును.
౭ „వ. ఇట్లు గాంచి తదాగమనమ్మున కచ్చెఱు వడి యచ్చెలి కి ట్లని యె" ౨ ఆ ౭౦ శ్రవ.

„గీ. ప్రొద్దు గ్రుంకెను జీకటుల్ పొసఁగ నాయెఁ
బోలుపు మీఱఁగ భూమణ భూషితాంగి
వగుచుఁ దోడింత లేక యుద్యానమునకు
నేల వచ్చితి? పనిఁ బూని బాలసాని!" ౨ ఆ ౭౧ శ్రవ.

మెలమెల్లనఁ గన చెంత కరుదెంచిన బాలామణిం గాంచి మధుసూద నుఁ డిట్లని నాఁడు. బాలామణి వేశ్య. గౌరవనీయులకు మ్రొక్కుట వే శ్యల యాచారము. అయినను గ్రంథకర్తలు బాలామణిచే మధుసూద నునకు మ్రొక్కించినారు గారు. మధుసూదనుఁడు సామాన్యుఁడా? „వి త తయశుండు, ధార్మికుఁడు, వేలకు వేలు గణించు వాఁడు, పండితుఁడు, స మస్తరాజ మకుటీ మణి రంజిత పాదుఁ, డార్య సన్నుతుఁడు" పయింబయి ధరామరుఁడు. ఆపై ననురాగమును దిరస్కరించు చున్న బాలామణి మ నోహరుఁడు. అతఁ డొక బాలామణీ నమస్కృతికి నోఁచుకొనలేడా? బా లామణిచే నమస్కరింపఁ బడక మధుసూదనుఁ డిట్లనుగుట ప్రకృతి విరుద్ధ ము. రస విధ్వంసకము. ఔచిత్య భంజకమును.

౮ „సీ. కోకీ మనోనంత శోకాబ్ధి కెవ్వాని
యుదయంబు పర్వ చంద్రోదయంబు" ౩ ఆ ౨౨ శ్రవ.

ఎవని యుదయము కోకీ మనోనంత శోకాబ్ధికిఁ జంద్రోదయమో య ట్టి చంద్రుఁ డుదయించెనఁట! అహా! వర్ణనా చమత్కారము! దిద్దు

కొందరు గాత.

౯ ॥క. అందుది గోరిన గాడిక

నాఁడే కోరినను మొగలి నంటెదవి యనుచున్

జేడెలు సెప్పఁశీ నామొత

నేఁడే మీ వలన నాకు నిక్కం బౌరౌన్. ౩ ఆ ౩౨ ప్ర.

నాఁడే యన మగవాఁడని కర్త్రభిప్రాయము. కాని కొలుత నాఁడు ది యని ప్రయోగించి యిట మగవాఁ డనక నాఁడే యనుటచేఁ బ్రక్రమ భంగము గలిగినది. విశేష్యమును మాటిమాటికిఁ జెప్పవలసి వచ్చి నప్పు డద్దానికి మారుగా సర్వ నామమును బ్రయోగించుట సర్వ కవి సమ్మతము. వీరు సర్వనామమునే విశేష్యముగఁ బ్రయోగించిరి. ఇది యూన్నపుం గృతి నిర్మించు శక్తి!

౧౦॥చ. ‘సుకవి యితండు నియ్యదియు సుందరి వీరల కెంతమాత్రమున్

రకముగనున్న’’దంచు ‘‘ఘటనానిపుణత్వము చూరి’’యుంచుచుఁ బెం

డ్లికిఁ జనుదెంచినట్టి ఘనులే నచియింపఁగ వింటి’’ ౩ ఆ ౨౮ ప్ర.

వీరల కెంతమాత్రము రకముగ లేదను సందర్భమున నెంతమాత్రము ననవలెను గాని యున్నదని చెప్ప నప్పు డట్లు ప్రయోగింపరాదు. ‘‘వీరల కెంత యేనియున్’’ అని యుండిన రస ముట్టి పడును. ఈ విషయమును వీరు గమనింప లేరైరి. మఱియు నిందు ‘‘సుకవి యితండు నియ్యదియు సుందరి’’ యనుచో సముచ్చయ మనకాద మున్నది. అది యనగత్యము. ‘‘సుకవి వరుం డితం డిదియు సుందరి’’ యనినఁ బ్రౌఢముగ నుండదా? ఇప్పుడో; చప్పగ నున్నది.

౧౧॥ఉ. చందురుఁ జూచి యుల్కి పడుఁ జల్లని గాలికి వెట్టఁ బెందునే

చందము నందమున్ గనఁగ సైపఁడు’’ ౩ ఆ ౫౬ ప్ర.

అందము చందము నని లోకోక్తి. అద్దానిని వీరు తల క్రిందుగఁ బ్ర

యోగించిరి. అగుటచే రసము సలక్షింపైనది.

౧౨. ఉ. మందులు వేసియున్నవియె మాయలమాటలు డక్కు మాన్పులౌ
మంద తిరస్మితమ్ములును మక్కువ చక్కిలి నొక్కులౌ వినా"
౩ ఆ ౭౭ శ్రవ.

మందస్మితములు గావటే! మంద తిరస్మిత మనుటలో నేమి విశేష మున్నది? ఈ "తిర" యను నది కేవలము పాద పూరణార్థము వచ్చినదే. వీరు తమ లక్షణా పరిణయము నందొకచో "మలయ మంద సమీర కుమారుఁ డేరుచునే" (౨ ఆ ౧౭) అని ప్రయోగించినారు. మలయ మారుత మనినఁ జాలును. దానికి మందత్వమును గల్పించినారు. కాని దోసము గాదు. "మలయ మరుదంకురమా" యని చేమకూర వెంకన్న. వీరంతతో నూరకుండ లేదు. మలయ మంద సమీర కుమారుఁ డనినారు. అహా! ఎంత సరసముగ నున్నది!

౧౩. సీ. ఏ చరణాయుధం బింపు మీరఁగఁ బాడె
ని యతికి ప్రాతస్సని యతిఁ దెల్పె
నే చరణాయుధం బాచారి విప్రని
త్యస్నాన దైవజ్ఞతను వహించె
నే చరణాయుధ ప్రాచుర్య రూపుఁడై
హరి నిశీథము వేఁకువగఁ జేసె
నే చరణాయుధ శ్రీ చేత శోభిల్లి
తాఁ పురమ్మున నుండెఁ గాపురమ్ము
గీ. అట్టి చరణాయుధ సమాజ మఖిల జార
చోరులకు గుండెలో దిగుల్ బోవు కొనఁగ
ఉ ఉ ఉ ఊ ఊ ౩ యటంచు నత్యుచ్చ రీతిఁ
గూయ సాగెఁ [illegible] నిను గాళ్లనుండి" ౩ ఆ ౮౮ శ్రవ.

ఈ పద్యమును గురించి తిరుపతి వేంకట కవుల తవిటిగొట్టె* కుం ప్రత్యుత్తర మొసంగుచు (౧-౨-౩-౧౯౧౩) నాంధ్ర పత్రికలోఁ గవిత యన నేమి? యను వ్యాసమున శ్రీ కుమారస్వామి శాస్త్రి గారిట్లు వ్రాయుచున్నారు. "దీనిలో నేమున్నది? ఉ, ఊ, ఊూల కాలము వంటి కాలము గల యచ్చు క్రమముగా హ్రస్వ దీర్ఘ ప్లుత సంజ్ఞ కలది యగునని యర్థము గల పాణిని సూత్రమును, కుక్కుటరుతము నందలి ఉకారములలో నేక ద్వి త్రి మాత్రత్వ మున్నది కావున ఆ కాలాదులు చెప్పఁబడులోను నర్థము గల యాఖరి వాక్యములును, మొదటి పాదములో నున్నవి. తరువాత రెండు పంక్తులలో రెండు పురాణ కథ లున్నవి. నాల్గవ పాదములోఁ బిఠాపురమునఁ గుక్కుటేశ్వరుఁ డున్నాఁ డనుట యున్నది. గీతములో నొకటి విరియు నప్పుడు జార చోరులు భయపడుదురని అల్లసాని పెద్దనాదులు పాడి పారవిసిరిన రోఁకటి పాటయున్నది. మఱియు కోడి "ఉ, ఊ ఊ" యని కూయుటను ప్రత్యక్ష విరుద్ధాంశ మున్నది. కోడి "కొక్కొరోకో" యని కూయు నట్లు విందుము. ఒక వ్యాకరణ సూత్రము, రెండు కథలు, పిఠాపురములోఁ గుక్కుటేశ్వరుఁ డున్నాఁ డను నొక మాట ఒక రోఁకటి పాట, ఒక ప్రత్యక్ష విరుద్ధాంశము కలిసి కవిత్వ మగునా?"

౧౮ . క ఏదియుఁ దోఁచక కదుఁ బెం

---

* ౨౭-౨-౧౯౧౩వ తేదీని వెలువడిన ప్రకాశమానమగు సువర్ణలేఖలోఁ దిరుపతి వేంకట కవులు తవిటిగొట్టె యనునొక వ్యాసమును ప్రకటించినారు. తవిటిగొట్టె యను శబ్దము దుష్టమని గాఁబోలు వీరు తమ ప్రకటనమునఁ దవిటిగొట్టె యని గర్హించిరి. కాని యదియు దుష్టమే. తవుడు శబ్దముగాని తవిడు అను శబ్దము లేదు. తవుడుశబ్ద షష్ఠీవిభక్తికము. అగుటచేఁ దవుటిగొట్టెయని సాధురూపము.

౨॥చ. చెలఁగెడి శిష్టకోటికిఁ బ్రసిద్ధ మనంత పురాభిధానముల్ ”
౧ ఆ ౬౮ శ్రేవ.

“పురాభిధానముల్ ” అనుచో సముచ్చయ మెందులకు?

౩॥గీ. ఇట్లు బాలామణియును గామేచ్ఛపట్టఁ జాలక” ౧ఆ ౯౮ శ్రేవ.

బాలామణియును అను దాని యందు సముచ్చయ మెందులకు? బాలామణి తల్లి కూడఁ గామేచ్ఛఁ బట్టఁ జాలక యను నపార్థము కూడ వచ్చుటకా?

౪॥ఉ. చిన్నతనమ్మునందు సమశీల వయస్కులఁ బిన్నవారలన్
క్రన్ననఁ గూడి ” ౧ ఆ ౯౯ శ్రేవ.

ఈ క్రన్నన శబ్ద ప్రయోగము వలనఁ గలిగిన విశేషమేమి?

౫॥గీ. తప్పుగాఁ జూడ రేని నే నిప్పు డొక్క
మనవిఁ జేసెద దేవర మనవి చిత్తగింపవలె” ౨ ఆ ౨౦ శ్రేవ.

ఇందొక మనవి వ్యర్థము. దేవరమనవి యన దేవర వారియొక్క మనవి యను నపార్థముగూడ వచ్చుచున్నది.

౬॥గీ. తగిన యన్నంబు లోనికిఁ దగిన కూరఁ దొరకదు ”
౨ ఆ ౨౧ శ్రేవ.

అన్నమునకుఁ దగినకూర, యనినఁజాలును. తగిన యన్న మనవక్కఱ లేదు. దీని కుదాహరణము “ గంతకుఁ దగిన బొంత ” తగిన గంతకుఁ దగిన బొంత యని యేరైన నందురా?

౭॥శా. గా। నీ నీచుల్ విసఁబోరు చూడరు ధనంబీసీ ధనంబీయకే పోసీ ”
౨ ఆ ౨౫ శ్రేవ.

ఇందొక ధనము పాదమును బూరించినది.

౮॥క. “ నీ చరణ్ననఁ దన కౌగ్నవమూని పాలు ద్రావిన ”
౨ ఆ ౩౩ శ్రేవ.

ఇంకలి చయ్యెన, యనునది నిరర్థకము.

౯॥ఉ. బాలము చేసి రిచ్చట వెనంజనుపంచు నట్టయ్యె వారునుఁ ”
౨ ఆ ౧౦౦ శ్రవ.

మధుసూదనుఁడు పెండ్లికి వచ్చునఁట, అనినఁ జాలును. త్వరగా నను టెందులకు?

౧౧॥సీ. ఒకచోట సకల వైదిక సంతతుల గోష్ఠి ”   ౩ ఆ ౮ శ్రవ.

సకల యను పద మిందు వ్యర్థము.

౧౧॥సీసగీతము. అ న్నదీతీర సౌభాగ్య మరసికొనుచు
మోదమంచుచు న మ్మధుసూదనుండు ”
౩ ఆ ౨౮ శ్రవ.

“ అరసికొనుచు ” అనుటెందులకు? అరయుచు నఁనినఁ జాలును.

౧౨॥గీ. పవలు చెయివట్టి పిలిచినఁ గులుక కట్టి
చాన నమవన చీకటింగోన స్త్రీని
చీరఁ గట్టినతఱి నన్నుఁ జేయు వెట్టి నగిరి ’   ౩ ఆ ౬౨ శ్రవ.

ఇంకలి “ స్త్రీని పీర కట్టిన తఱి ” నను ప్రయోగము నిరర్థకము. “ పగలు చెయివట్టిలాగిన రానిదాని నమవస చీఁకటిలోఁ గనునన్న చేసెనఁట! అని లోకోక్తి.

౧౩॥సీ. తెనకుఁ దానై పందుకొని తిన్నవద్దియ
న్నంయు గారద్రి సున్నంబు గాని ”   ౩ ఆ ౬౯ శ్రవ.

నాల్గు పాదముల యందు “ నది, యది ” యని రెండేసితడవులు ప్రయోగించినారు. అం దొక్కొక్కటి పడికట్టు రాళ్లలోఁ జేనుచున్నది.

౧౪॥చ. ..మఱవని ప్రేమలా? తలఁపుమర్మములా? వెలలేనిముద్దులా?
యెఱువదిమందియైననరితాయా? మఱిమూఁకరియాన యానికుఁ ”
౯ ఆ ౩౯ శ్రవ.

"రగుల్కొను" అనఁగా సంతుకొను, కామించునని రెండర్థములు గలవు గాని యతిశయించునని యర్థము లేదు.

౩ ఉ. మానిపతకన్న హీనలగు మానవతుల్ వ్యభిచార వృత్తికిన్
జాలక కష్టభోగులకు జంకుచు నొక్కొకనిన్ వరించుచున్
గాలము పుచ్చుచుండ" ౩ ఆ ౩౮ పాణి.

"వరించుచున్" అని శత్రర్థక చువర్ణమును బ్రయోగించుటచే నొకతె యొకని పిమ్మట నొకనినిగా ననేకులను వరించుచునని యర్థము వచ్చుచున్నది. వరించిరో యనిన నీ యవస్థ తటస్థింపకపోవును.

౪ చ. అయినను నా లతాంగి హృదయంబొక కొంత భవత్సమాగమ
ప్రియమని కొన్ని చెప్పు నిజేంగిత సంతసమంత నిప్పుడ
ద్దయుఁ గతిప్రాణ్య యయ్యెడన తల్లియు నయ్యెడ కేగుదెంచె"
౩ ఆ ౮౯ పాణి.

తల్లియు ననుచో "యు" అను సముచ్చయ మనవసరము. అదియుండుటచే జలజాక్షి తల్లిగాక మఱియొక వ్యక్తికూడ వచ్చెనను నర్థము వచ్చుచున్నది.

౫ ఉ. వేడుక కాఁడటంచు మది వెక్కస మించుకలేక "యొండొరుఁ
గూడఁగఁ జెప్పు" టంచు ననఁగూడునె?" ౪ ఆ ౨౧ పాణి.

వెక్కసమన దుస్సహత్వము, దుస్సహ వచనములు, దుస్సహము, దుర్లభము, అధికము, ననునర్థములున్నవి. సందియమించుకలేక యని కర్త్రభిప్రాయము. అది వెక్కసమైపోయినది.

౬ ఉ. హెచ్చెడి యుత్సుకత్వమున కెద్దియుఁ బారము గాక"
౪ ఆ ౬౧ పాణి.

హెచ్చెడిది యుత్సుకత్వమా? ఉత్సుకమా?

౭ ఉ. కావున నన్ను ... గింపకొందువ మేని నొల్ల "భా

ర్యావిధిఁ జూచికొ" మ్మనుచు నప్పుడ చెప్పె మొగంబ"
౮ ఆ ౯౫ పాణి.

"నన్ను" అనుటచే జలజాక్షి తల్లి తనను భార్యావిధిఁ జూచికొమ్మన నని యపార్థము వచ్చుచున్నది. నన్ను అన జలజాక్షి నని కర్త్రభిప్రాయము.

---

## శ్రవణానందము.

౧ ఉ॥ అంచితమైన వారి పద యారసి యీ రసముఁ గ్రహించి లా
లించినఁ జాలు" ౧ ఆ ౧౫ శ్రవ.

ఈ రస మనఁ బూర్వోక్తమని యర్థము. కాని యింగలి రస మను నర్థము రాదు.

౨ క. ఆకారము సౌశీల్యం
బీ కాశ్యతిఁ జెందినట్టి తెనక మొసఁగె సు
శ్లోకుఁడు నతి లోకుఁడగు నగు
నా కృష్ణయ భార్య పాప మాంబిక సతియై. ౧ ఆ ౩౮ శ్రవ.

పాప మాంబిక "సతియై" యొసక మొసఁగె ననుటలో నపార్థమున్నది. సతియై యనుటలో నేమియు విశేషము లేనిదే వీరీ యపార్థమును గ్రహింప కుండఁ బ్రయోగించినారు.

౩ చ. కోర్కెలొసఁగు రామచంద్రనగరీ నరసాధిపుఁ గూర్మిమంత్రియై"
౧ ఆ ౩౬ శ్రవ.

చెలమయ మంత్రి నరసాధిపుని కూర్మి మంత్రి యని గ్రంథకర్తల యభిప్రాయము. నరసాధిపుఁ గూర్మిమంత్రి యనుచో నరసున్న వేసి కకారమునకు గకారాదేశము చేసినారు. అగుటచే నర్థము చెడిపోయినది.

౪॥చ. చెలమయమంత్రి కచ్చపమకు......గలిగిరి పుత్రులై సమధికం బగు బుద్ధి బలంబు డంబునన్ " ౧ ఆ ౩౯ శ్రీప. ఇందలి " బుద్ధి బలంబుడంబునన్ " అనునది ౯౧వ పద్యము నందలి " అసూయాఖిల భాగ భాగ్యములచే " నను పదముచే వలెఁ జెలమయ మంత్రి యెడల ననిర్వాచ్యమగు నపార్థమును గలిగించినది.

౫॥గీ. భర్తృనుకూల యతిథుల పాలి యన్న
పూర్ణ నకల సుగుణముల పుట్టినిల్లు
నన్నుహాలక్ష్మి సాటి కామమ్మ తనకు
ధర్మసతిగాఁగ నచ్చమూ తనయుఁ డలరె? " ౧ ఆ ౪౩ శ్రీప.

తనకు (వేంకటనాయ మంత్రికి) ధర్మ నతి యైన కామమ్మ భర్తృకనుకూల యఁట! ఔట్టా! ఎంతటి యపార్థము! సత్పురుషుల కింత కన్న విచారకరమగు వ్రాఁత యుండఁ జాలదు. కృతిపతి వంశవర్ణనమున లజ్జాకరమును విచారకరము నగు నింతటి యపార్థమును గలిగించుట శోచనీయము! మన నరన తిరుపతి వేంకట కవు లిందలి యపార్థమును గ్రహింపలేక పోయిరి. పాపము శాంతించును గాక. కామమాంబకు వీరి వ్రాఁత వలన నేదోషము నంటకుండును గాక.

౬॥సీసగీతము. ఒక్కొక్కరి కొక్కొక విశేష మున్న దంతె
కాని యన్ని విశేషముల్ గలుగ లేమ
కలిగెఁ బో యివి యన్ని యఖండుఁడైన
మహిత వాగ్దేవు చెలమయామాత్య మణికి...

చెలమయ మంత్రి యఖండుఁ డఁట! అనఁగా ముక్కలు గాని వాఁడని యర్థము. విద్యాఖండుఁ డని గాని, సంపదఖండుఁ డని గాని ప్రయోగింపక కేవలము అఖండుఁ డనుటచే నీ యపార్థము వచ్చినది.

౭॥ఉ. వేసవి మన్నె ... రదాళి నానలో

మస్కారము లను నపార్థము వచ్చుచున్నది. మఱియుఁ దర్శన సౌధమ్ముల ద్వార సీమాలను నన సౌధమ్ముల యందును ద్వారసీమలయందు నని కర్త్రభిప్రాయము. కాని సౌధమ్ముల యొక్క ద్వారసీమ లను నపార్థము వచ్చుచున్నది. అనఁగా మధుసూదనుఁడు జనపాలుర నౌకరులచే మాత్రము నమస్కరింపఁ బడుచు రాజుల మేడల ద్వారముల యందు మాత్రమే సంచరించు నను యర్థము గలుగుచున్నది. మధుసూదనున కెప్పుడును రాజ దర్శనము కాలేదని యభిప్రాయము తేలుచున్నది. ద్వారసీమలను నను వాక్యమిూ యర్థమును స్థిరీకరించుచున్నది. రాజులచే నమస్కరింపఁ బడుచు రాజసభలోఁ జరియించుచున్న నన్న అను నభిప్రాయమును వీరింత చక్కఁగా విశదీకరించినారు.

౧౭॥సీ. సుకవమ్ము నం దనాదరము గల్గియు నాద
రమ్ము లేదని చెప్పరాని దాని॥ ౫ ఆ ౩౮ శ్రవ.

చెప్పరాని దన చండాల స్త్రీ యను నపార్థము వచ్చుచున్నది. ఆంధ్ర దేశమున మాల మాదిగలకుఁ జెప్పరాని వాండ్రను నభిధ గలదు.



## పునరుక్తులు.



### పాణిగృహీత.



౧॥మ. ఎలకోటిం బురగొంచు నీ ర్గలిగి తామే కాల మం దింక క
ప్పలతో నిండియు॥ ౧ ఆ ౫౯ పాణి.

అరవింద నగరము నందలి బావులు లేఁత కొంకాయ లోని యియ్యాని నీరువంటి నీరు గలిగి యుప్పలతో నిండి యున్నవఁట! అప్ప లన నీళ్లని యర్థము. బురాము లని [illegible] నచ్చుటకు నీరప్పలతో నిండి

యు నని ప్రయోగించినారు. కాని యిటుఁ బునరుక్తి దోషము గలిగినది. «ఎలసిటికా» అను పదమును బ్రయోగింపక కేవల మప్పలతో» నని ప్రయోగించినచో నీ పునరుక్తి కవకాశ ముండదు. రచనయుఁ బ్రౌఢముగ నుండి యుండును. శ్లేషయుఁ జక్కఁగ నుండి యుండును.

౨ «ఉ. చాపున చాయయున్ మిగులఁ జక్కని చన్గవ» ౨ఆ౭౩ పాశి.

౨౦ వ పద్యమునఁ జనులు చంకల దూరె నని చెప్పుటచే మఱల ౨౨ వ పద్యమున గబ్బి గుబ్బ దోయిని వర్ణించుటచేఁ బునరుక్తము. అంతటితో నూరకుండక మఱల నీ ౨౩ వ పద్యములోఁ జెప్పుట పునరుక్తమునకుఁ బునరుక్తము.

౩ «మ. . తనకై తా నట కేగ నూహ గొనుచున్ దర్శించుచున్»

౩ ఆ ౧౫ పాశి.

ఊహా, తర్క్యము సమానార్థకములు. «అధ్యాహార స్తర్క ఊహా» యని యమరకోశము.

౪ «శా. సంసార స్థితిఁ జక్కఁబెట్టుకొనుచున్ జాయన్ దగంజూచు చా
శంసాపాత్రముగాఁ బ్రవర్తనము మెచ్చన్ జేయుచున్నంత»

౪ ఆ ౧౮ పాశి.

ఆశంసాపాత్రముగా, మెచ్చన్, అనునవి సమానార్థకములు! ఒకటే చాలును!



## స్వధానందము.



౧ «ఉ. చిన్నతనమ్మునందు సమశీల వయస్కులఁ జిన్నవారలన్ »

౧ ఆ ౯౯ శ్రవ.

చిన్నవారికి సమశీల వయస్కులు చిన్నవారే యగుదురు. మఱలఁ జి

న్నవా రనసక్కఱలేదు. అట్లనుటచేఁ బునరుక్తి యైనది.

౨ ,,సీసగీతము. లీలఁ గ్రొజ్జెడఁ జుట్టి చొల్లెమ్ము వెట్టి ,,
౨ ఆ ౧౧ శ్రవ.

చొల్లెమన జడతోఁ జుట్టిన చుట్ట. కబరీబంధ విశేషము. క్రొజ్జడ యని నను నదియే యర్థము. అగుటచేఁ బునరుక్తి దోషము. మఱియు నిందలి ,, క్రొజ్జెడ ,, యనునది యపరూపము. ,, క్రొజ్జడ ,, సాధురూపము.

౩ ,, పికికానగరి క్రీడిత మందిర,.....సుకవి బాంధవ సంయుత సౌధభూమికా! ,, ౨ ఆ ౧౧౭ శ్రవ. గృహమును రెండుమాఱులు చెప్పినారు.

౪ ,,ఉ. ముక్కర ముక్కునం గదిసి ముద్దులుగుల్క బులాకి మోవిపై
చక్కి నటింప,, ౫ ఆ ౩౪ శ్రవ.

ముక్కర, బులాకి రెండును బర్యాయపదములు.



## పడికట్టు రాళ్లు.



### పాణిగృహీత.



౧ ,,గీ. అవధరింపు మనంతరం బంత సకల ,, ౨ ఆ ౭ పాణి. అనంతరంబు అంత. అని యేకార్థమున రెండు శబ్దముల నుపయోగించినారు. అం దొకటి పడికట్టు రాళ్లలోఁ జేరినది.

౨ ,,క. ఆ! యానీచులతో వేశ్యల
నైన గృహమ్ములకు నేగు ,, ౨ ఆ ౬ పాణి.

ఇందలి ఐన శబ్దము నట్టిద.

౩ ,,చ. డాసినడలి చందముగ వినుతునిక్కము మీమనమక్కఱంపడగ ,,
౨ ఆ ౭౭ పాణి.

ఇందలి "నిక్కము" నిక్కముగ యతి పూరణకొఱకు వచ్చినదే.

౮॥గీ. ఈ ప్రబుద్ధుఁ డెలమి ని వ్వన్నెలాఁడికి వలపు మగఁడు"
౨ ఆ ౧౦౫ పాణి.

ఇది యెందుకువచ్చిన యెలమి? ( సంతసము? )

౫॥గీ. ఏటి కిద్దాని నీవలయించె దంక
నీవు చెప్పిన దంతయు నిక్కమయ్యె"　　౩ ఆ ౨౫ పాణి.

ఇందలి యొక నీవు పడికట్టురాయి.

౬॥ఉ. ......ఇది త్రిశుద్ధిగ ని మరణంపు వేళ నీ
వీ పసివానికి న్నిచట నించుక యేని వ్యయింపక "
౮ ఆ ౧౦౨ పాణి.

"ఇచట" యనునది యిట నిరర్థకము. "పాదపూరణార మయం పటాటోపః"

౭॥క. సరసాంతఃకరణా! సు
స్థిర గానాభరణ"　　౫ ఆ ౧ పాణి.

గానము సుస్థిరమా? అదిరా! వింత!

౯॥చ. కళవళ మందుచుఁ జెతలఁ గందుచుఁ గుందుచునున్న బోటి య
వ్వాల వలపుఁ జూగండటకు వచ్చినయంతన". ౬ ఆ ౯౩ పాణి.

ఇందలి "అవ్వాల" అనునది నిరర్థకము.

---

# శ్ర వ ణా నం ద ము.

---

౧॥క. కారుపులిఁజూచి నక్కయు
నారూఢిగ వాతలిడిన నట్లగునేమో"　　౧ ఆ ౨౦ శ్రవ.

ఇందలి "కారు" "ఆరూఢిగ" అను పదములు నిరర్థకములు.

౨౹౹చ. చెలఁగెడి శిష్టకోటికిఁ బ్రసిద్ధ మనంత పురాభిధానముల్ ”
౧ ఆ ౬౮ శ్రవ.

“పురాభిధానముల్ ” అనుచో సముచ్చయ మెందులకు?

౩౹౹గీ. ఇట్లు బాలామణియును గామేచ్ఛఁబట్టఁ జాలక” ౧ఆ ౯౮ శ్రవ.

బాలామణియును అను దాని యందు సముచ్చయ మెందులకు? బాలామణి తల్లి కూడఁ గామేచ్ఛఁ బట్టఁ జాలక యను నర్థము కూడ వచ్చుటకా?

౪౹౹ఉ. చిన్నతనమ్మునందు సమశీల వయస్కులఁ బిన్నవారలన్
క్రన్ననఁ గూడి ” ౧ ఆ ౯౯ శ్రవ.

ఈ క్రన్నన శబ్ద ప్రయోగము వలనఁ గలిగిన విశేషమేమి?

౫౹౹గీ. తప్పుగాఁ జూడ రేని నే నిప్పు డొక్క
మనవిఁ జేసెద దేవర మనవి చిత్తగింపవలె ” ౨ ఆ ౨౦ శ్రవ.

ఇందొక మనవి వ్యర్థము. దేవరమనవి యన దేవర వారియొక్క మనవి యను నర్థముగూడ వచ్చుచున్నది.

౬౹౹గీ. తగిన యన్నంబు లోనికిఁ దగిన కూర। దొరకదు ”
౨ ఆ ౨౧ శ్రవ.

అన్నమునకుఁ దగినకూర, యనినఁజాలును. తగిన యన్న మనునక్కఱ లేదు. దీని కుదాహరణము “ గంతకుఁ దగిన బొంత ” తగిన గంతకుఁ దగిన బొంత యని యెవ్వరైన నందురా?

౭౹౹శా. గా। నీ నీచుల్ వినఁబోరు చూడరు ధనంబీనీ ధనంబీయకే పోనీ ”
౨ ఆ ౨౫ శ్రవ.

ఇందొక ధనము పాదమును బూరించినది.

౮౹౹క. “ నీ చయ్యనఁ దన క। న్గవమూసి పాలు ద్రావిన ”
౨ ఆ ౩౩ శ్రవ.

ఇందలి చయ్యన, యనునది నిరర్థకము.

౯. ఉ. జాలము చేసి యిచ్చట వెనంబడుచుందు నటయ్య వారునన్ "
౨ ఆ ౧౦౦ శ్రవ.

మధుసూదనుఁడు పెండ్లికి వచ్చునఁట, అనినఁ జాలును. త్వరగా నను టెందులకు?

౧౦. సీ. ఒకచోట సకల వైదిక సంతతుల గోష్ఠి " ౩ ఆ ౮ శ్రవ.

సకల యను పద మిందు వ్యర్థము.

౧౧. సీసగీతము. అన్నదీతీర సౌభాగ్య మరసికొనుచు
మోదమందుచు నమ్మధుసూదనుండు "
౩ ఆ ౨౮ శ్రవ.

"అరసికొనుచు" అనుటెందులకు? అరయుచు ననినఁ జాలును.

౧౨. గీ. పవలు చెయివట్టి పిలిచినఁ బలుకక కట్టి
చాన నమవస చీకటింగోన స్గి
చీరఁ గట్టినతెఱి నన్నుఁ జేయు వెన్ని సగిరి " ౩ ఆ ౬౨ శ్రవ.

ఇందలి "చీరఁ గట్టిన తెఱి" అను ప్రయోగము నిరర్థకము. "పగలు చెయివట్టిలాగిన రానిదాని నమవస చీఁకటిలోఁ గనుసన్న చేసెనఁట!" అది లోకోక్తి.

౧౩. సీ. తినకుఁ దానై వండుకొని తిన్నవద్దియ
న్నంబు గాదద్ది సున్నంబు గాని " ౩ ఆ ౬౫ శ్రవ.

నాల్గు పాదముల యందు "నది, యది" యని రెండేసితడవులు ప్రయోగించినారు. అందొక్కొక్కటి పడికట్టు రాళ్లలోఁ జేరుచున్నది.

౧౪. చ. ..మఱవని ప్రేమలా? తలఁపుమర్మములా? వెలలేనిముద్దులా?
యెఱువదిమందిరైయనసరి[illegible]? మఱి[illegible] "
౪ ఆ ౩౫ శ్రవ.

అఱువదిమంది యనునది సరికట్టు గాయి. మఱియుఁ గరియాన యూ
నకు ననుదానిలో నొక యాన శబ్దము గూడ నట్టిదే.

## అసభ్యములు.

### పాణిగృహీత.

౧ ఉ. నాఁ డిం దన పీఠి నేగు తెలిసి నిక్కఁ గనుంగొని" ౨ ఆ ౧౫ పాణి.
౨ సీ. విభ్వోకవతి గబ్బి గుబ్బగోలొయుఁ జూడ
మఱిమాఱి బతిమాలు యనియు రతికి" ౨ ఆ ౭ ౨ పాణి.
౩ గీ. మురుగు కాలువ జాతిలోఁ బోడము పలుగులు" ౬ ఆ ౫ ౩ పా.

### శ్రవణానందము.

౧ తగునా! సిరి వాడిరేవు మా । వేంకట రత్న మంత్రికి" ౧ ఆ ౨ శ్రవ.
౨ ఉ. కాంతల మాట నమ్ముకొని కంతునకిచ్చి గడు లోకువై తదీ
యాంతర భావముల్ దెలియ నైసరుబాజ్జయటంచు నుబ్బుచుం
జెంత వివేకులైన మది నీ విషయంబు పరీక్ష సేయఁగా
నెంతయు బుద్ధి నమ్ముకొని యేటను బడ్డ విధమ్ము గాదొకో"
౩ ఆ ౭౫ శ్రవ.
౩ చ. కవు లొనరించు గ్రంథములఁ గాంచిన వారలె యొక్కఁడో దన
జ్ఞవరుల మంచు నిక్కఁ దగుగా!" ౪ ఆ ౩౦ శ్రవ.
౪ సీ. "చూచు నేమొకొ సిగ్గు చోటు" లంచును మధ్య
మధ్యఁ [illegible] మూలఁ జేరుఁ

“సోకించునో” యంచుఁ గుల్కు గుబ్బల మధ్య
మధ్యఁ జేతుల నొక్కు మానాభిసంగుఁ
“పరిహసించునో” యంచుఁ బలుకరియమ్ముల మధ్య
మధ్య నాయక యుక్కు మూలు పెనఁగు

* * * * * * *

౪ ముద్దు లిడి నొడి తెలుగమి మోవి గొఱుకు
బదులు తీర్చెనె యని చేతఁ బట్టి పొమ్ము
రాజ్య మిది నాది యంచు గర్వమ్ము చూపు” ౪ అ౧౦౩ శ్రవ.

౫ “మ. నన్నును నిర్లజ్జనిఁ జేసి వేశ్య గృహముం జూర్పంగ నీకొప్పనే?
౫ అ ౨౧ శ్రవ.

౬ “సీ. సుకతమ్ము నం దనాదరము గల్గియు నాద
రమ్ము లేని చెప్పరాని దాని” ౫ అ ౩౮ శ్రవ.

౭ “చ. “వ్రతమును బాడు చేసి నను వంచనఁ జేసితి వెంత దానవే?
యతివరో” యన్న మాటకు హా హా! యని నవ్వుచు “ముద్రవైచియుం
చితిరె? బిగింపు మాట లికఁ జెప్పకుఁ డంచు వచించు నాఁటి ని
చతురత నేఁటికిన్ మదిని జల్లని వేళఁ గలంతురో గోమలీ!”
౫ అ ౪౩ శ్రవ.

౮ “చ. “అలరిననాఁడు నాస్థలమునందల కేళి గృహమ్ము నందు నా
సలుకని వారకాసుకత సౌఖ్యము దేలిన నాఁట నుండియున్
గులసతి మోము గన్గొనుటకున్ మన సొగ్గదు “అంతసాగఁ బెం
డిలి యిఁక నేల?” యంచును బరించెడి పెద్దల నోరు గ్రొవ్వనే?
౫ అ ౪౪ శ్రవ.

౯ “చ. మమత దలిర్పఁగా నుపరి మన్మథకేళిని గూడు వేళ “నో
రమణిరొ నన్ను గూడి యిఁక అంతులు సేయుఁగ నీకుఁ జెల్లెగా

## ఔచిత్యభంగము.

ఔచిత్యమును గుఱించి వీరించుకంతయైన శ్రద్ధ వహించినట్లు కన్పట్టదు. బాగుగఁ బరిశీలింప నౌచిత్యమను దానిని గవిత్వము చెప్పుటలోఁ బాటింపవలయునని సంగతి వీ రెఱుంగనట్లు తోఁచుచున్నది. ఈ రెండు గ్రంథములలోఁ బాణిగృహీత మిన్నయై యున్నది. దీని యందలి యౌచిత్యభంగములను మేము ప్రదర్శింపఁ జాలకున్నారము. ఈ గ్రంథమునందలి యౌచిత్యభంగములను బ్రదర్శింపఁ బూనుట గ్రామ్యభాషలో వ్రాయఁబడిన గ్రంథము నందలి వ్యాకృతి భ్రంశములను సవరింపఁ బూనుట వంటిది. కావున దీనియెడల నౌదాసీన్యమును వహించి నందులకుఁ బాఠక మహాశయులు మమ్ము మన్నింతురు గాత.

## శ్రవణానందము.



ఇందలి కథానాయకుఁడు శ్రీవైష్ణవుఁడు. పండిత రాయఁడు. మహా విరాజు. ,,సమస్తరాజ మకుటీ మణి రంజిత పాదుఁడు'' ,,వితతయశుండు'' అతని నెంత పొగడవలెనో వీరంత పొగడినారు. కాని వెంటనే---

గీ. నక్క పొదరిల్లు పంచాననంబు కరణి
వారకామిని యిలు సొచ్చె వైష్ణవుండు
ఎన్ని చదువులు చదివిన నేమి? నీచు
లకు గురుత్వంబు వైష్ణవులకు నలెంబు॥ ౧౭ ౧౧౧ శ్రవ.

అని యుభయలోకమునకుఁ ద్రోసివేసినారు. ఉగ్రకులజుఁడును గథానాయకుఁడు నగు మధుసూదను నిట్లు నీచపఱచుట న్యాయ్యముగాదు. వారకాంతయైనను నూర్వ[illegible] వి[illegible] మహాకవి కాళిదాసుఁడు

నారకాంత యన లేక పోయినాఁడు. ఇది యిట్లుండ మధుసూదనుఁడు వారకామిని యిలు సొచ్చెనని నపుడు చెప్పిన యుపమ సందర్భముగ లేదు. యుద్ధ సమయమున యోధుఁడు ప్రతియోధుని క్రోఁడిపోయి నిచ్చస్థలమున దాఁగినప్పు డుపయోగించిన యుపమయినది. కాని వీరీసంగతిని గమనింపఁ జాలక పోయిరి. మధుసూదనుఁడు విశిష్టాద్వైతియైనను నీ రాతనిని వర్ణించిన పట్టున,---

"క. ఎప్పుడు మనమునఁ గలఁచిఁ

దప్పక కడుపారఁ గన్న తల్లిం [illegible] గా

నప్పరమేశ్వరి యాతని

కప్పుడె కననౌను బుద్ధ్యమది యెట్టిదియో॥ ౧ఆ ౭౩ శ్రవ.

అని వ్రాయించినారు. ఇది యసంగతము.

"క. అప్పరమేశ్వరి యనుచో

నప్పరమేశ్వరి యటంచు ననపర్థంబుల్

జెప్పెదరఁట! మాయురె! యటు

లెప్పలు వల్కింపనేకదా? మా తెలుఁపుల్ "

దీనినెట్లో విఱిచి లక్ష్మి యని యర్థము చెప్పిన నది యెట్లుండునో మేము చెప్పనక్కఱలేదు. ...లక్ష్మి సహస్రనామ స్తోత్రాదుల యందుఁ గల యిట్టి శబ్దములు విశేషణ పర్యవసాయులు గాని విశేష్యములుగావు. విష్ణు సహస్రనామము లందు "శివాయనమః, శర్వాయనమః" అనికలదు. దానంజేసి శివశర్వ శబ్దములు విష్ణు పర్యాయములుగాఁ బ్రయోగించు వెఱ్ఱులుండరు గదా?"

౨౬, ౫౭వ పుటలు. కవితా విమర్శన ఖండనము.

మఱియొకచో బాలామణి తల్లిచే,--

"క. నవనాగరికులు కొందఱు

శివ శివ! మన మేమి తప్పుచేసితిమొ" (౨ ఆ ౧౦౭ శ్రీవ)

అనిపించినారు! బాలామణియుఁ గల్లియు వైష్ణవమతస్థు రాండ్రు. వైష్ణవులు సంతాపమును దెలుపుటలో శివ శివా యనినట్లు వర్ణించుట యన్యాయ్యము.

మఱియొకచో మధుసూదనుఁడు,--

"క. ధనకాంతా మోహమ్ములు
జనులకు స్వాభావికములు జగమున నెనఁడీ
ధనకాంతా మోహమ్ములఁ
గనకుండునొ వాని శివునిగా నెన్నఁ గదే" ౩ ఆ ౭౧ శ్రీవ.

అనినాఁడు. కేవల ధన కాంతా మోహమ్ములను గననివాఁడు శివుఁడని చెప్పరాదు. ఏ కాంతలమోహములం గననివాఁడుశివుఁడనిన నెన్నగనుండియుండును. కాని యీ యసందర్భముతో మన కిప్పుడు ప్రసక్తి లేదు. ఒకానొక వైష్ణవుఁడు శివుని గొప్పగా వినుతించె ననుట మాత్రము విచారణీయము. ఈ వ్రాఁత కేవల మసందర్భము. శైవులం గేరుచు, శివాలయములకుం బోక శివుఁడు మార్గమున నెదురుపడి నప్పుడు మూల మూలల డాఁగియో మోములపై ముసుఁగు వెట్టుకొనియో తమ నేత్రములకు దోష మంటకుండఁ గాపాడుకొను వైష్ణవ సోదరులు శివుని గొప్పగా వినుతింతురనుట కేవలము ప్రకృతి విరుద్ధము.

మఱియొకచో

"క. అని తన మదిలో వనుకొని
యును బుద్ధిని ద్రిప్పలేక యొగి నుత్తరమ
క్కనకాంగికి లిఖియింపుట
కును ప్రారంభించెఁ గొంత కొంత తెగువతోఁ గదే"

౮ ఆ ౭ శ్రీవ.

అని వ్రాయించినారు. ఇది యసంగత్యపు వ్రాఁత. ఏమన? ఈ జాబు శాలామణికి ప్రత్యుత్తరమా? కాదు కాదు. కానిచో నిపుడు మధుసూదనునకు, శాలామణికి జాబు వ్రాయవలసి నంతటి యవసర మేమి వచ్చినది? తనచేఁ ద్రోయఁబడి నదీతీరము నుండి శాలామణి యెటకేగెనో మధుసూదనుఁడెఱుఁగఁడు. ఇంటికి వెళ్లెనని యూహచే వ్రాయుచున్నాఁడు. శాలామణి నిజముగ నింటికే వెళ్లెనని నాఁడు శాలామణితల్లి యనేకవిధములఁ జెప్పినపు డేమైన శాలామణిపైఁ గనికరించినాఁడా? ఉద్యానవనమున నొంటరిగా యున్నప్పుడు వచ్చి శాలామణి స్వయముగఁ బ్రార్థించినది. అప్పుడైన నొప్పుకొనలేదు. తరువాత వసంతకాలమున మలయమారుతము వీచుచుండఁ, దరు శాఖాంతరముల నుండి చంద్రికిరణములు మెఱుఁగుచుచుండ శుక పిక శారికాదుల సృష్ట మధుర గీతములు సేయుచున్నపుడు మనోహర నదీతీరమున నొంటిగాఁ బోవుచున్నపుడు కడు బడలికతోఁ జనుదెంచి « శంకవలదంచు » గాఢముగ జేయిపట్టుకొని కౌఁగిలించుకొనఁబోయినది. అప్పుడైన నొప్పుకొనలేదు. పయిఁబడు శాలామణినిఁ గర్రాట్లునఁ ద్రోసి పోయినాఁడు. అట్టివాఁ డిప్పుడు శాలామణికి « నీవు ధనము

డక కేవల సౌఖ్యమునే కోరెదవేని నా యభ్యంతరము లే »

నవసరముగ జాబు వ్రాయుటా?

గ్రంథము మనుచరిత్రముతోఁ బోలియుండవలయు నని వీరు ప్రతిరి. కాని యది నెఱవేఱినదిగాదు. ప్రవరుఁడు వరూథిని నెట్లు తిరస్కరించెనో యట్లు మధుసూదనునిచే శాలామణిని నిరస్కరింపించిరి. కాని తరువాత గుట్టుచెడి మధుసూదనునిచే శాలామణికి జాబువ్రాయించినారు. అల్లసాని పెద్దన్న వరూథినిఁ దిరస్కరించిపోయిన ప్రవరుని మఱల నాగిపైఁ బ్రవేశ పెట్టిన యెడలఁ గృష్ణరాయఁ డాతని కేమి బహుమతి సేయునో మా చదువరు లూహించుకొందురుగాత. ప్రవర వేష

మున గ్రంథస్థానిఁ బ్రవేశపెట్టినప్పుడు స్వైరము పెద్దన యెంత గడుసుంద
నముగఁ బ్రవర్తించెనో పరిశీలింతురుగాత.

వీరు మఱియొకచో,—

"చ. రవిమొఱఁగాయె సక్కలువ రాయనికన్న, నిదేమి పాపమో
పవనునికన్న నా మదికిఁ బావకుఁడే మొఱఁగాయె, నక్కటా!
శివ శివ! వేయిమాటలికఁ జెప్పఁగ నేటికిఁ! జిత్తజాత సం
భవమగు నా యవస్థ భగవంతుఁ డెఱుంగును నే నెఱుంగుదుక్"
౪ ఆ ౩౩ శ్రవ.

వైష్ణవియగు బాలానుని మధుసూదనాచార్యుని కుత్తిరము వ్రాయుచు శివ శివా! యని వ్రాసినది. ఇదిన్యాయమా? మఱియు నిందలి " భగవంతుఁ " డను శబ్దమీ సందర్భమున నప్రయోజ్యము. ఇది యిట నసభ్యమైనది.

వీరు శుద్ధ విశిష్టాద్వైతమతస్థుఁ డగు మధుసూదనుఁడు పరమేశ్వరస్థాపనకుఁ డనినారు. శివుని వినుతింపించినారు. అట్టియెడల నిదియొక గొప్ప వింతయా?

వీరి యన్యాయ్యపు వ్రాఁత లింక ననేకములున్నవి. కాని దిక్ప్రద... ముగఁ జూపిన యీ దోసములను బట్టి యవి యూహించుకొనుటకు ... మములే. అయినను, ప్రకృతముతో సంబంధింపక పోయినను వీరి ... పు వ్రాఁత నింకొకదాని నుదహరించి యీ యనౌచిత్య భంగ ప్రక... ను విరమించెదము.

"సీ. ఎండ తీక్ష్ణిన సెజ్జ యిల్లు చేరని బోటి
చేరి వాకిలి తూరఁ జేయనేర్చె
నంత వేఁడిన మొగం బెత్తనేరని చాన
మెత్తి దిట్టిగప్పు పల్తొత్త నేర్చె

నింక మంచము విడె చిన్నాయ నేరని లేమ
యిచ్చి వాతెఱ యాన నీయ నేర్చె
చెయి వట్టి లాగిన సిగ్గ యంటని గోల
యంటితోఁ బన్నుంట యరియు నేర్చె
గీ. ముట్టినంతన ప్రాణము ముగ్గ రాలు
ప్రాణపడక పీఁగొనఁగ నేర్చె నతని కొకంత
హారా! నేఁటిరీతి మారుఁట జేతోంతరంబు
నాతి కన్నరికమ్ము రెండవ దినమున.

3 అ ఉ 2 లక్షణా పరిణయము.

అని వీరు వ్రాయుంచినారు. ఈ నాతి మద్రప్రాక్శ్వరుండను, క్షత్రియకుల శేఖరుండు నగు బృహత్సేన ధగా కాలుని యనుంగుఁ గూఁతురు, భగవంతుఁడగు శ్రీకృష్ణుని ముగ్గుల భార్య. అగు లక్ష్మణ కన్నెరికమ్ము మాయెనని వ్రాసినారు. కటకటా! ఎంతఘోరము! ... సందర్భముల యందుఁ బ్రయోగింప వలెనో వీరి కింత చక్కఁగఁ దెలియును.



# ప రి శి ష్ట ము.

పాఠక మహాశయులారా!

గ్రంథము ముగింపక పూర్వము మీతో నొక విషయమును గురించి యించుకంత చెప్పికొన వలసి యున్నది.

ఈ గ్రంథముల యందు దోషము లింతమాత్రమే కలవనియు వ్యాకరణాది దోషము లిన్నిమాత్రమే కలవనియు మీరు తలంపవలదు. అప్రస్తుత ప్రశంసలు, విభక్తి చ్యుతులు, వచన చ్యుతులు, ప్రక్రమ భంగములు, ఛందో భంగములు, గ్రంథ చౌర్యములు మున్నగున వనేకములు గలవు. కాని వాని నన్నిటిని విమర్శించిన గ్రంథమింకను బెద్దదియైపోవునని మానితిమి. వ్యాకరణా ద్యపభ్రంశములు పూర్ణముగాఁ బ్రదర్శింపమికిఁ గూడ నిదియే కారణము. వీరి కవిత్వము నందలి ముఖ్యదోషములను దిక్ప్రదర్శనముగ మాత్రము చూపితిమి.

కావ్యము వ్రాయుట యననఁ జైపై పనిగాదు. దానిలోఁ జాలఁ గష్టమున్నది. మహాకవులు కాళిదాసాదులు కూడఁ బ్రమాదముల పాలయిరి. కాని వీరు మాత్రము,--

*" సత్కావ్య నిర్మాణ చాకచక్యంబన్న
షడ్రసోపేత భోజన " మనికొనిరి.

---

* గ్రంథ పు. నానాశాశ సందర్శనము.



# కళాభివర్ధనీ గ్రంథమాల.

౧౯౦౯ లో స్థాపితము.

---

ఇంకను నవలలు, దేశ చరిత్రములు, మహా పురుషుల జీవితములు వ్రాయులు పరిపూర్ణమునఁ జక్కని కాలికో బైండు చేయించి ప్రకటింపఁ బడును.

ఈ గ్రంథమాలలో నిదివఱలోఁ బ్రకటించిన గ్రంథముల నన్నింటిని గొనుచు నిఁక ముందు ప్రకటింపఁ బోవు గ్రంథముల నన్నింటిని గొనుటకు నొప్పుకొను వారు శాశ్వతపు చందాదారులు.

శాశ్వతపు చందాదారులకు నీ గ్రంథమాలలోని గ్రంథము లన్నియు నంచె కూలి మేమే భరించి నూరు పుటలకు ౦-౮-౦ చొప్పున నిచ్చెదము. ఇతరులకు నీ పుస్తకములు అంచె కూలి గాక నూరు పుటలకు ౦-౧౦-౦ చొప్పున నీయఁ బడును.

అనుబంధ గ్రంథములను చందాదారుల కుచితముగ నిచ్చెదము.

శాశ్వతపు చందాదారులు సొమ్ము మొదట నీయ నక్కఱ లేదు. ఒక్కొక్క పుస్తక మచ్చు ముగియఁగనే అది వ్యాల్యూ పేబిలుద్వారా పంపఁ బడును.

చందాదారులు ప్రవేశ రుసుము క్రింద ౦-౪-౦ చెల్లింప వలెను. ప్రవేశ రుసుము తమ దరఖాస్తుతోఁ బంపవచ్చును. లేదా మొదటబంపు వి. పి. లోఁజేర్చి రాఁబట్టుకొనఁ బడును.

ఇదివఱలోఁ బ్రకటింపఁబడిన నాల్గు గ్రంథములు దక్క నిఁక డెమ్మీలోఁ బ్రకటింపఁ బడవు.

మా గ్రంథమాలకు ౧౦ మంది చందాదారులను జేర్చువారికి నిదివఱలోఁ బ్రకటించిన నాల్గు గ్రంథములను నూరక యిచ్చెదము.

## ఇదివఱలోఁ బ్రకటించిన గ్రంథములు.

### వారకాంత. (ప్రతులు లేవు)

### రామదేవ విజయము. ౦-౬-౦.

ఇది యొక నాటకము. రెడ్ల చరిత్ర. కథా కల్పన మత్యద్భుతము. రెడ్ల సంభాషణము విని తీరవలెను. వీర రస పరిప్లుతము. రెడ్ల శౌర్య మిందుఁ జక్కఁగఁ బ్రదర్శింపఁ బడినది.

# ఆంధ్ర ప్రచారిణీ గ్రంథ నిలయము.

నిడదవోలు—కృష్ణా జిల్లా.

---

ఇందు వెలువడిన నవలలు.

| | చందాదారులకు. | ఇతరులకు. |
|---|---|---|
| దుర్గేశనందిని | 0—12—0 | 1—0—0 |
| వసుమతీ వసంతము | 1—0—0 | 1—8—0 |
| లలిత చంద్రహాసము | 0—10—0 | 0—14—0 |
| మృణ్మయి | 1—0—0 | 1—6—0 |
| సీతారామ | 1—0—0 | 1—8—0 |
| నూర్జహాను | 1—0—0 | 1—8—0 |
| రాజసింహ | 1—0—0 | 1—8—0 |
| మాధవీలత | 1—0—0 | 1—5—0 |
| మృణాలిని | 1—0—0 | 1—5—0 |
| దురదృష్టవంతులు | 1—0—0 | 1—8—0 |
| విష వృక్షము | 1—0—0 | 1—5—0 |
| రాధారాణి | 0—3—0 | 0—4—0 |
| యుగళాంగులీయకము | 0—3—0 | 0—4—0 |

ఇందు రెండు మాసముల కొకటి చొ॥ కాలికో క్రౌనుసైజు ముద్దుల మూటకట్టు గ్రంథములు వెలువడుచుండును. 100 పేజీలకు రు 0—6—0 చొ॥ వెల యేర్పఱచి చందాదారులకుఁ బంపుచుందుము. ఎంత పెద్ద గ్రంథమైనను రు 1—0—0 కు మించియుండదు. ఇందు శాశ్వత చందాదారులుగాఁ జేరు వారికి మా యనుబంధ గ్రంథమాలికా గ్రంథములన్నియు దిగువ వ్రాసిన రీతిని మిక్కిలి చౌకగా నీయఁబడును.

## అనుబంధ గ్రంథమాల.

అతి మనోహరంబులును, రసవంతములును, నీతిదాయకంబులు నగు చిన్న చిన్న నవలలను ముద్రించి మన యాంధ్రప్రచారిణీ గ్రంథమాలికకనుబంధములుగాఁ బ్రకటించుచున్నాము. ఈ నవలలన్నిటిని జనసామాన్యమునకంతకు నందుబాటుగా నుండునట్లు స్వల్పమూల్యమునకుఁ బంపుచున్నాము. ఇందును మా చందాదారులకి

తరులకిచ్చు వెలకంటె తగ్గించియిచ్చుచున్నాము. మా గ్రంథమాలికా గ్రంథముల తోఁబాటు వీనినిగూడఁ బంపుటకనువుగానుండుటచే నీగ్రంథములకును మా చందాదారులు పోస్టేజి చెల్లింపవలసిన యావశ్యక మెంత మాత్రమును లేదు. ఈ నవలలు రు 0—2—0 లు మొదలు రు 0—8—0లు వఱకును ఇతరులకును, రు0—1—6 మొదలుకొని 0—6—0 వఱకును మా చందాదారులకును దొరకుచుండును. చందాదారులు కానివారు పోస్టేజి ప్రత్యేకముగా భరింపవలసియుండును. ఈనవల లెన్నటికిని రు 0—8—0 లు వెలకుమించియుండవు. 300 పేజీలున్నను మా చందాదారులకు రు 0—6—0 ల వెలకుమించియుండవు. ఈ నవలలు క్రౌను 8 పేజీల సైజునను డెమ్మీ 12 పేజీల సైజునను వెలువడుచుండును.

మా చందాదారులలో నీ చిన్న నవలలను కోరువారు మాకు ఆర్డరును పంపిన యెడల నప్పటికిఁ దయారైన యనుబంధములను పెద్దనవలలతోఁ గలిపి పంపుచుందుము. కాబట్టి కావలసినవారు మాకు వెంటనే ఆర్డరులు పంపింపవలయును.

ఇందు ప్రకటింపఁబడిన నవలలు.

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| మాలతి | 0--1--6 | 0--2--0 |
| ప్రభావతి | 0--2--0 | 0--3--0 |
| కమలాకాంతుఁడు | 0--1--6 | 0--2--0 |
| లలిత | 0--2--0 | 0--3--0 |
| సాధన | 0--5--0 | 0--7-- |
| సీరన | 0--5--0 | 0--7--0 |
| పరిమళ | 0--6--0 | 0--8--0 |
| రోహినాను | 0--6--0 | 0--8--0 |
| ఉన్మాదిని | 0--2--0 | 0--3--0 |
| లీల | 0--3--0 | 0--4--0 |

వలయువారు,—

శ్రీ, ఆంధ్ర పరిచారికా గ్రంథ నిలయము,
నిడదవోలు, కృష్ణా జిల్లా.
అని వ్రాయవలయును.

N. RAMANUJASWAMI, B. A., B. L.,
*President.*

T. DHARMA ROW, B. A.,
*Editor.*

# "వేగుఁజుక్క" గ్రంథమాల.

( Established on 12th December 1911 in honour of the Delhi Coronation Durbar. )

బరంపురము, గంజాం జిల్లా.

1. శాశ్వతపు చందాదారుల నీతిని గ్రంథము లిమ్మఁబడును.

2. ప్రవేశరుసుమును నాల్గణాలనిచ్చి, మేము ప్రచురించు గ్రంథములన్నిఁ బుచ్చుకొనుచుండువారే శాశ్వతపు చందాదారులు. ఏదేని యొక్క గ్రంథము పుచ్చుకొనినచో, నట్టివారు శాశ్వతపు చందాదారులు కారు.

3. శాశ్వతపు చందాదారులకు వత్సరమునకు మూఁడు గ్రంథములను పోస్టేజీ కాక రెండు రూపాయలకును, మరియు నొక యనుబంధ గ్రంథమును ఉచితముగ (వత్సరాంతమున) నీయఁబడును.

4. శాశ్వతపు చందాదారులగువారు, వత్సరపు చందాయగు రెండు రూపాయలను (పోస్టేజీలుకాక) ముందుగ నీయవలెనను నిబంధనలేదు. మేము ప్రచురితగ్రంథముల వి.పి.గా నంపినపుడెల్ల వానిని తిరుగఁగొట్టక పుచ్చుకొనుచుండినఁ జాలు.

5. శాశ్వతపు చందాదారులు ప్రవేశరుసుము నాల్గణాలను ముందుగనీయనిచో, దానిని, వారికి వి పి చేసిపంపు మొదటి గ్రంథములఖరీదు, పోస్టేజీలతోపాటు, రాఁబట్టుకొందుము.

6. ఏరేని కొంతకాలము మా పుస్తకములఁ బుచ్చుకొని, పిమ్మటమాని, తిరుగఁ బుచ్చుకొనవలెనన్నచో, వారుతిరుగఁ బ్రవేశరుసుమునిచ్చి, శాశ్వతపుచందాదారులై, మున్ను గైకొనని గ్రంథములఁ గొనవలెను.

7. శాశ్వతపు చందాదారులగు స్త్రీలుగాని, సమాజములుగాని, ప్రవేశరుసుము నీయనక్కఱలేదు.

8. మా గ్రంథమాలకు వత్సరపుచందా మిక్కిలితక్కువగా రెండురూపాయలే యగుట పోస్టేజీలు కొనువారే భరించవలెను.

## ఈగ్రంథమాల స్థాపించుటలో మాముఖ్యోద్దేశములు.

1. ఆంధ్రభాషలో నిదివఱకవలంబించని కొన్ని నూతన మార్గముల ననుసరించి, గ్రంథముల రచియింపించి, భాషామతల్లికి నూతనాలంకారములు సమకూర్చుట.

2. అముద్రితపూర్వక విఖ్యాత గ్రంథములఁ బ్రచురించుట.

3. ఆంగ్లేయభాషా గ్రంథరచనాసామర్థ్యముగలవారిచేతను, పండితకవులచేతను, గ్రంథములను వ్రాయించి యేతత్కాలమున గ్రంథకర్తలను ప్రోత్సాహ మొనర్చుట.

4. ఈ సమాజము యొక్క వత్సరలాభమునఁ గొంత వేఱుపఱచి, సహాయావశ్యకములయిన, యాంధ్ర సమాజములకు శక్తివంచనలేకుండ, మాకు సాధ్యమైనంతవఱకు, ద్రవ్యసహాయ మొనర్చుట.

## గ్రంథ రచనా నియమములు.

1. (i) ప్రకృతి వర్ణనలు (Description of Nature)
   (ii) స్వభావనిరూపణము (Characterisation)
   (iii) స్వభావోన్మీలనము (Development of character)
   (iv) నూతనకల్పనలు (New ideas)
   (v) చరిత్రవిషయిక చిత్రములు (Historical Beauties)

మొదలగు విశేషములచే విరాజిల్లుచు జనబాహుళ్యమునకుపయోగించు నవలలు, నాటకములు, ప్రబంధములు, జీవచరిత్రములు, భాషాంతరీకరణములు, మొదలగు గ్రంథములను బ్రచురింతుము.

2. సాధారణముగ గ్రంథమునం దేదేని యొకానొక చమత్కారవిశేషము లేనిచో మేము ప్రచురింప సమకట్టఁజాలము.

## సాధనవిధానములు.

1. మా పుస్తకములుకొని చదువుచుండు శాశ్వతపు చందాదారుల సంఖ్య వృద్ధి కావలెను. 2. పోషకులును, రాజపోషకులును, దమ కరుణావృష్టిచే నభిమానించుచుండవలెను. 3. పండితకవులు, గ్రంథకర్తలు, దయఁజూపుచుఁ బ్రచురణార్హము గ్రంథము లొసఁగుచుండవలెను. ఈ మొదలగు సహాయము లెన్నియేని కావలెను.

## శాశ్వతపు చందాదారుల సమకూర్చు వారికి ప్రోత్సాహము.

1. మా గ్రంథమాలకు ఐదుగురు శాశ్వతపుచందాదారుల సమకూర్చువారికి వేఁగుఁజుక్క యొక్క రెండవ కూర్చియగు, "వాఁడే వీఁడు" అను నిరూపకనవల నుచితముగ నిత్తుము. పదుగురను జేర్చువారి కొకవత్సరమునఁ బ్రచురించు గ్రంథముల నుచితముగ నిత్తుము. పదునైదుగురను జేర్చువారు మా గ్రంథమాలకు శాశ్వతముగ నుచితపు చందాదారులగుచున్నారు.

2. ఇరువదియైదుగురకుఁ దక్కువగాకుండఁ జేర్చువారికి, మా మండలివారు బహుమానము నిత్తురు.

3. ఏటఁబడికి నించిన చందాదారులఁ జేర్చువారు మా సమాజమునకు, వారిష్టపడిన చో పోషకు లగుచున్నారు.

4. శాశ్వతపు చందాదారులను సమకూర్చు సామర్థ్యముగలవారు, ఏజంట్లుగాఁ బనిచేయఁగోరినచో, వారికిఁదగిన కమీషనుగాని, జీతముగాని, యీయఁబడును.

5. తాము సమకూర్చు శాశ్వతపు చందాదారులు మా గ్రంథములనెల్లఁ గొనువారుగా నుండవలెను.

## ప్రచురింపఁబడిన గ్రంథములు.

ఉషఃకాలము (The Dawn)--కలభాషిణి యనుపేర నాంధ్రభాష, స్వీయచరిత్రఁ జెప్పుచుండ నటుల వ్రాయఁబడిన యాంధ్రభాషాచరిత్ర. సంపాదక ప్రణీతము. 232 పేజీలు కలిగి, "పేపర్ వైటు" కాగితముపై ముద్రింపఁబడిన వచనకావ్యము. వెల చందాదారులకు 0-14-0. ఇతరులకు 1-8-0. పోష్టేజికాక.

వాఁడే వీఁడు (This is He)-అపూర్వమగు నిరూపకనవల. ఆంధ్రభాష యిదివఱకెన్నఁడెఱుంగదు. దీనిఁ జదువ ప్రారంభించినది మొదలు ముగించువఱకు మానాయ వనసాధ్యము. కార్యదర్శి ప్రణీతము. కథాసందర్భానుసారము వేయఁబడిన 'హాఫ్ టోన్ బ్లాక్' కలిగి 278 పేజీలుగల చిత్రమగు వచన ప్రబంధము. వెల చందాదారులకు 0-12-0 ఇతరులకు 1-2-0 పోష్టేజికాక.

ప్రేమము (Love)--ఇది యొక వాస్తవ విషయము ననుసరించి వ్రాయఁబడిన పవిత్రనాటిక. చరిత్రాత్మకమై, సంఘసంస్కార సంబంధికమై విరాజిల్లుచు, షేక్స్పియర్ మహాకవి నాటకఫక్కి ననుసరించి, వ్రాయఁబడినదగుటఁ బెక్కండ్రచే సనుతి గాంచినది. (అచ్చులో నున్నది) వెల చందాదారులకు 0-6-0 ఇతరులకు 0-9-0 పోష్టేజికాక.

## ఇతర విషయములు.

1. అన్యోన్యసహాయప్రకటనలకు తావొసంగుదుము. ఇతరుల ప్రకటనలకు సరసమగు ధరల కారుచౌక చేసి యేర్పరచినాము.

ఇట్లు, భాషాసేవకుఁడు

 దేవరాజు వేంకట కృష్ణారావు.

కార్యదర్శి.

# వివేకవర్ధనీ గ్రంథమాల.

## నియమములు.

1. ఆంధ్రభాషామతల్లికి సేవఁజేయుటయే యీగ్రంథమాలయొక్క ముఖ్యోద్దేశము.

2. ఇందు ఆంధ్రభాషాభివృద్ధికిఁ దోడ్పడఁదగు నాలుగు గ్రంథములు వత్సరమునకుఁ బ్రకటింపఁబడును.

3. ఇందు ప్రబంధములు, నవలలు, నాటకములు, దేశచరిత్రలు, దేశోపకారులగు కొందరుమహనీయులచరిత్రలు మున్నగునవి ప్రకటింపఁబడును.

4. ఈ గ్రంథమాలయందు ప్రకటింపఁబడు గ్రంథములనన్నింటి కొనుటకు నొప్పుకొనువారు శాశ్వతపు చందాదారులుగా నెంచుకొనఁబడుదురు.

5. శాశ్వతపు చందాదారులకు ఈ గ్రంథమాలలోని గ్రంథములన్నియు పోష్టేజీ మేమే భరించి నూఱుపుటలకు రు 0-4-0 వంతున నిచ్చెదము ఇతరులకు ఈ పుస్తకములు పోష్టేజీగాక నూఱుపుటలకు రు 0-6-0 వంతున నీయఁబడును.

6. ఇందు సంవత్సరమునకు 800 పుటలకంటె నెక్కువపుటలుగల గ్రంథముల ప్రకటింపఁబడవుగాన చందాదారులకు వత్సరమునకు రు2-0-0 కంటె నెక్కుడుకాదు

7. శాశ్వతపు చందాదారులు ప్రవేశరుసుము. రు 0-3-0 ల నీయవలెను.

8. ఈ గ్రంథమాలయందుఁ బ్రకటింపఁబడు గ్రంథములన్నియు దళసరి కాగితములు, చక్కనియచ్చు, మంచిబైండు గలిగియుండును.

## ఇందు ప్రకటింపఁబడిన గ్రంథములు.

1. బుధకుమార చరిత్ర:—ఇది షట్చక్రవర్తులలో నాలవ వాఁడగు పురూరవు గురించి వ్రాయఁబడిన యైదంకముల చక్కని నాటకము. ఇందు నవరసములుఁ జక్కగా వర్ణింపఁబడినవి. ఇందలి పద్యచమత్కృతి చదివినగాని తనివిదీర నేరదు.

దీనివెల చందాదారులకు రు 0-7-0 ఇతరులకు రు 0-11-0.

గ్రంథకర్త వంగల చిన్నకృష్ణయ్యశాస్త్రి.

2. సత్యాబాయి:—ఇదియొక చరిత్రవిషయిక నవల. శిలాదేవుఁడను రాజద్రోహియొక్క మోసమును, సంగరాణాచక్రవర్తియొక్క ధైర్యస్థైర్యములను, సత్యవ్రతయోగియొక్క కార్యనిర్వాహకత్వమును మొదలగు విషయములను విపులముగా వర్ణింపఁబడినవి. దీనిఁ జదివిన పదునారవ శతాబ్దప్రారంభమందలి హిందూదేశవుయొక్క రాచకీయ వ్యవహారములన్నియుఁ దెలియఁగలను.

దీనివెల చందాదారులకు రు 0-6-0. ఇతరులకు రు 0-9-0.

గ్రంథకర్తలు, ఎల్. [illegible] ఉప్పయ్య, టి. కేశవరావు.

తిమ్మాపురపుశతావధానము:—ఇది గ్రంథమాలానుబంధగ్రంథము. ఇందలి పద్యములు మృదుమధురశైలిచే రచియింపఁబడినవి.

దీనివెల రు 0-1-0. ఇది చందాదారులకుచితము.

గ్రంథకర్త. రాళ్లబండి వెంకటసుబ్బయ్య శాస్త్రి.

## రాఁబోవు గ్రంథములు.

సర్వంజగన్నాథం:—ఇదియొక మిశ్రమప్రబంధము. ఇందు కలియుగ చర్యానంతరయు స్వాభావికముగా వర్ణింపఁబడినది. గ్రంథకర్తలు. రాళ్లబండి వెంకటసుబ్బయ్య శాస్త్రి, చల్లా పిచ్చయ్య శాస్త్రి. శతావధానులు.

పీరాబాయి:—ఇదియొక చరిత్ర విషయిక నవల.

గ్రంథకర్తలు. పి. ఆంజయ్య, డి. రంగాచారి.

## తయారగుచున్న గ్రంథములు.

రాజవదన, భువనమోహిని, కరుణాదేవి, విద్యుల్లత, హరిశ్చాత్రపీయము.

N. B. ఈ గ్రంథమాల కయిదుగురు శాశ్వతపు చందాదార్లను జేర్చువారికి ఇందు ప్రకటించిన గ్రంథములలో వారు కోరిన దుచితముగా నీయఁబడును. పదునైదుగురు శాశ్వతపు చందాదార్లను జేర్చు వారిని మా గ్రంథమాల శాశ్వతపు చందాదారునిగాఁ జేర్చుకొని ఇందు ప్రకటింపఁబడిన గ్రంథము లన్నియు నుచితముగా నీయఁబడును.

ఇట్లు,

టి. కేశవరావు.

మేనేజర్, వివేకవర్ధనీ గ్రంథమాల.

ఇనగల్లు, పెదనందిపాడు పోస్టు. గుంటూరు జిల్లా.

---

# ఆంధ్ర భారతి.

ఇది సచిత్ర మాస పత్రిక. డబిల్ క్రౌను 8 ఆకారమున నుండును. ఇట్టి పత్రిక వేఱొకటి యాంధ్ర భాషలో లేదు. అన్ని విధముల నిది ఇంగ్లీషు నందలి స్టాండర్డ్ రివ్వ్యూను బోలియుండును. ఎల్లరుం జదువం దగినది. లోక జ్ఞానమును గలిగించుట కింతటి యుత్కృష్ట సాధనము వేఱొకటి లేదు. ఎల్లరి కందుబాటగునట్లు చందా రు 4-0-0 లు మాత్రమే యేర్పాటు గావింపఁబడినది. ఆంధ్రసోదరు లెల్లరు దీని నాదరింతురుగాక.

వలయు వారు;—

 మేనేజరు ఆంధ్ర భారతి.

బందరు.

అని వ్రాయవలెను

---

# క వి త.

పత్రికాధిపతులు రామ కృష్ణ కవులు.

పోషకులు శ్రీ పిఠాపురము రాజా వారు.

ఇందుఁ జక్కని నవలలు, నాటకములు, ప్రబంధములు ముద్రింపఁ బడుచుండును.

చందా సం 1 కి రు 3-0-0

పల్లెటూరి వారికి ,, రు 2-0-0

విద్యార్థులకు, స్త్రీలకు ,, రు 1-8-0

వలయువారు,— మానేజరు కవిత,

పిఠాపురం

అని వ్రాయవ